## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016386

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మహారాజు



రచయిత,


బి. సోమసుందరము.

చింతలపూడి.

# మహారాజులు

## మరుత్తుఁడు



సీ॥ సంవర్తుఁడను మహాసంయమి దేవతా
గురుతోడి యీసున నరుగుదెంచి
పూని యుపద్రష్టయై నడపంగ హి
మాచలపాదంబుఁ నందు శక్ర
వరుణ ప్రభృతులైన సురలు మహామునీం
ద్రులును సహాయులై వెలయుచుండ
శాలా ప్రముఖ భవ్యసాధనంబులు గన
కమయంబులుగ వస్త్రకాంచనాద్య

ఆ॥ దధిపయః ఫలాది తర్పణ ద్రవ్య స
మృద్ధి సకల జనులు మెచ్చ పెక్కు
అధ్వరములు సేసె నట్టి మరుత్తుండు

... ... ... ...

కృతయుగాలంకారభూతుండును దానవిఖ్యాతచరిత్రుండును సకలసచివాప్తహితమిత్రుండునునగు కరంధముం

డను నృపపుంగవుండు గలండు. అతఁడు రాజ్యాభిషిక్తుఁడైన తనుతర కాలంబునకే వానిశతృవర్గంబు మాయోపాయంబున రాణ్మందిరంబు జొచ్చి వాని నిర్జించి యాలుబిడ్డలతో గాన నంబులకు వెడలనడిచె. అతండట బెక్కేండ్లు ఘోరతపం బొనర్చి కరము గ్రోలుఁగ నమర్చి ధమనకిృయ నొనర్ప నిఖి ల జనాశ్చర్యంబుగఁ జతురంగబలంబులును మహోన్నత ధనరాసులును మణినిధానంబులును బ్రభవింప రాజ ద్విగుణీకృతపృతాపుండై యొక్క మొగి శతృరాట్సైన్యం బులపైఁ గవిసి రూపడంచియుఁ దద్దారాపుత్రాదుల నర ణ్యంబులకుఁ బోఁదోలియు విఖ్యాతయశుండయ్యె. అతఁడు కరధమన కారణంబునఁ గరంధముఁడనఁ బఱగి మనువంశో ద్ధారకుండై నిరుపమాన పృతిభావిశేషుండును, నిశ్చల వైరా గ్యసముపార్జిత తపోధనుండునునగు నంగీరసు నుపదృష్టగాఁ జేసికొని హయమేధంబుల నంఖ్యాకంబులొనర్చి గడించిన మేటి మహాత్వంబున నిచ్ఛామాతృ సర్వలోకసంచార విభ వంబు వడసి కొంతకాలంబునకు నిజదేహంబుతో నిర్జరలో కంబున కేగెను. అమ్మహీపతి తనయుఁ డవీక్షిత్తు జనకునం తటివాఁడని పేరు మోసె. వాని కొమరుఁడు మరుత్తుం డనం త జవసత్వ సంపన్నత్వంబును, వేదవేదాంగశాస్త్రపురాణేతి హాసకథార్థవేతృత్వంబును, సత్యవాక్పరిపాలనాది సన్మార్గ వర్తనంబును గలిగి విష్ణుసదృశుండన నొప్పె. అమ్మనుజేం

దుని రాజ్యపరిపాలనా వైఖరి దివిజేంద్రునిం ద్రోసి రాజని పించుచుండెడిది. దాన నమరవల్లభుం డవనీవల్లభుపైం గినిసి కడలేని యీర్ష్య వహించి మంచి తరుణమునకై వేచి యుండెను.

అంతం గొంతకాలంబున కాక్షోణీశుం డధ్వరంబు సేయ సమకట్టి తత్క్రతు కర్తృత్వంబున కుచిత ఋత్విగ్జనం బెవ్వండాయని యోజించి యతండు సకలకళాపతియగు వాచస్పతి యని యెంచి యాతనిరావింప నిశ్చయించుకొనియె. ఇంద్రుం డీయుదంతంబు దివ్యజ్ఞానంబునం దెలిసికొని యా మనుజవల్లభుం డెల్లవిధంబులం దన్నతిశయించునని యీర్ష్యా పీడితుండై యమిత చింతాభరంబున నిజగురు నిలయంబున కేగి "గురూత్తమా! భూలోకంబున మరుత్తుండు జన్నంబు సేయుచు నన్నతిశయింప నిన్నుపాధ్యాయుగాం బ్రార్థింపనున్న వాండు. అమరవల్లభుండనగు నా కుపదర్శకం బౌనట్టి నీవు వేఱొక సామాన్య మానవుని యజ్ఞంబున కొజ్జవగుట నీకు న్యూనతకాదే" యని నిరూపించి పలికి వెండియు మన కిరువురకుంగల మైత్రిలో దలంచి యాతని విడిచిపుచ్చుమని ప్రార్థించె. గీష్పతి దివిజపతి మతినెఱింగి "ఓనాకాధిప! నాకు వేఱె చెప్పవలయునే. లోకాధినాథుండవును, మహా వైభవోజ్జ్వలుండవునగు నిన్సేవించు నే నన్యులం గొల్వ నాశింతునే. సోమసూర్యులు శీతోష్ణంబులు వీడినను, నుడు

గణంబు లిలఁదుల్లినను బృధ్వ్యాకాశంబు లేకమైనను నే నొ
రులఁ గొల్వఁజాలనని త్రికరణశుద్ధిగఁ జెప్పుచున్నాఁడ"
ననవుడు సంక్రందనుండు సంకోచంబుడిగి నిజమందిరంబున
కేఁగె.

ఈ వృత్తాంతం బెట్టులో లోకోత్తరుండగు మరుత్తుం
డెఱింగి మనం బెరియ శీఘ్రంబ త్రిదశాచార్యు కడ కేగి
తపోధనుండగు దేవగురూత్తముఁ బ్రార్థించిన నతం డాతనిం
దిరస్కరించి "ఓమనుజాధిపా! ఇంతకుమున్నె నన్నింద్రుండు
దన యజ్ఞంబునకుపదష్టగా వరించినాఁడు. నేనంతల కియ్య
కొంటి. ఇంక నా యాగమనం బెట్లు సాధ్యంబగు" నన
నా పుడమితేఁడు "అనఘా! నీవు సంకోచింపనేల? ముని
లోకభాసురుండగు నీ జనకుఁ డంగిరసుండు తొల్లి మా
తాత యజ్ఞంబు నిర్విఘ్నంబుగ నెఱవేర్పలేదే" యనిన

చ॥ విని ధిషణుం డమర్త్యులకు విన్నను వొప్పఁ గ్రతువ్వు [యోగముల్
మనముదలిర్పఁగానడపి మర్త్యునియాగము నొజ్జగాఁగజా
ల నిది నిజంబయింకనన: లాపమొనర్పక పొమ్మువేఱ యొ
క్కని నుపదర్శనంబునకుఁ గైకొనుమారసినీవునావుడున్

అంత భూపాలుండు దానం బుట్టినఁ బుట్టెడు పరా
భవంబుతో నిట్టలంబగు వగపుతో మగిడి వచ్చుచుండ
సంగీతశాస్త్రవిశారదుండును హరిధ్యానభాసురుండును నగు

నారదుం డయ్యెడ సాక్షాత్కరించిన నజ్జనపతి లజ్జావనత శిరస్కుండయి దండప్రణామంబు లాచరించి నిలిచిన ముని కుంజరుండు " ఓరాజచంద్రమా! పున్నమజాబిల్లిం జిన్నపుచ్చు నీ నెమ్మొగం బేలకో విన్ననై యున్నది. నీ విషాదకారణం బెఱిగింతువేని యద్దాని నుడుపఁజాలుదునేమో " యన వుడు పుడమిఱేఁడు దన పరాభవకారణం బామూలాంగ్రంబుగాఁ దెలియం బలికి జీవంబులపై విరక్తి వొడగట్టినట్లు చూపట్ట నారదుండు ధైర్యౌషధంబు వోసి " రాజా! పరాధీనవృత్తుండగు నా బృహస్పతినే పట్టుకొని ప్రాకులాడ నేల? అతం డంగీకరింపకున్న నెట్టి యుపద్రవంబును బుట్టనేరదు. వయసునఁ జిన్నయయ్యును వాని తమ్ముఁడు సంవర్తుఁడు ధీవిభవంబునఁ బెద్దయై వైరాగ్యంబు పెంపున దిగంబరుఁడై యున్నవాఁడు. ఆ తపసి మిన్నకడకేగిన నీయాగంబున కాతం డుపద్రష్టగాఁ గలండని హితంబు వలికిన నిలాపతి యిట్టులనియె॥

"క॥ మునివర బ్రదికితి సంవ

ర్తుని నెచ్చటఁగాంతు నెప్పరుసునందగ నా

డిన నతఁడు ద్రోవు సేయక

ననుఁ గైకొను నెఱుఁగ జెప్పు నాకుం గరుణన్"

అని ప్రార్థించిన ఋషివల్లభుఁడు జనవల్లభున కిట్లనియె. ఆతం డున్మత్తవర్తనంబునఁ గలుషపిసితంబు మొసవు

రాకాసియగు కాశీపురి నిరంతరమువర్తించు. వాని నెఱుంగు నుపాయం బెద్దియన

గీ॥ అనఘ వినుము పురద్వారమున శవంబు
నుంచుకొని యుండు మీవు నే తెంచి చూచి
వగ నివర్తించు వాని సంవర్తుగాఁగ
నెఱిఁగికొని యంత సద్భక్తి యెసఁగ మెసఁగ॥

వెనువెంటనే యేగి యొక విజనస్థలంబున వాని చరణసరసిజంబులకుఁ గరంబు శరణంబుఁ జొరుము. అతండు నా వృత్తాంతం బెట్లు నీకెఱుఁకవడియెనని యడుగు. త్రిలోక సంచారియగు నారదుండు ... అని నుడువుము. ఆపైఁ నివు డాతం డెందున్నవాఁడని నిన్నుఁ బ్రశ్నించు. నాకు నీ వృత్తాంతంబు సాంతంబుగఁ దెల్పి సాదఁజొచ్చెనని నిశ్శంక ననుమని చెప్పి వెడలిపోయెను. అమ్మహీపతి వారణాశీపురంబు దిక్కుమొగంబై యేగియేగి యొక్కచో నొక్క కుణపంబును సంగ్రహించి యద్దాని పురద్వారంబున నిడికొని వేచియుండె. అంతఁ గొంత తడవున కొక మతిభ్రమణుం డరుదెంచి శవంబును గన్గొని వ్రేటువడ్డ పనరంబువడువున రివ్వన నచ్చోటువాయుటయుఁ దడవుగా నాతఁడే సంవర్తుం డని యెఱింగిన నా తేఁడపరిమిత సంతోషభరితస్వాంతుం డయి వాని యడుగుజాడలను గమించి పోవంబోవ నతఁడు వెన్దిరిగి పైధూళి జల్లియునం బూత్కృత మాచరించియు దూ

పించియు పెక్కు విధంబుల వేదురుచందంబున సంచరింప నా
నృపాలుఁడును ముకుళితకరకమలుండై యన్నియు సహించి
వాని వెండియు వెన్నాడఁ దుట్టతుద కాతఁడొక నిర్జనప్రదే
శంబున విశాలవటవృక్షచ్ఛాయ మార్గపరిశ్రాంతునివోలెఁ
జతికిలంబడె. అంత మహీపాలుం డమితభక్తి మునిచంద్రు
నకుఁ బ్రణమిల్లి నిలువంబడినఁ దాపసశ్రేష్ఠుండు " ఓయీ!
నిన్నిటకుఁ బుత్తెంచిన నరాధముని నామంబు నిజంబుగ నెఱిఁ
గింపుము. అనృతం బాడిన నీ శిరంబు సహస్రశకలంబు
లగునని. మరుత్తుండు " మహాత్మా! త్రిలోకసంచారియగు
నారదుండనె ". అతఁ డిప్పు డేవిధంబున నెందుండెనని యా
డుగ వాని "కతఁడు మీ విధంబంతయుఁ దెల్పి యగ్నిప్రవే
శంబయ్యెనని విన్నవించె. అంతఁ బ్రచ్ఛన్నవేషధారియగు
జడదారి". బృహస్పతి నా కగ్రజుండు. అతఁడు తన తపో
బలంబున నన్నతిక్రమించి పరాభవించిన సకల సంపద్వైభవం
బుల విడనాడి జోగినై యెల్లయెడలఁ దిరుగాడుచుంటి. అట్టి
నావంటి బడుగువలన నీకయ్యెడి మేలెయ్యది. భ్రాత లెల్లె
డల మాతాపితృసములుగదా? నేను మాయన్నగీచినగీఁటు
దాఁటువాఁడనుగాను. అట్లుగాక నేనే కావలయునని నిశ్చ
యించుకొంటివేని మాన్యుండగు నాసోదరుననుమతిఁ బడయు
మని నుడివెను. రాజంత దానా వాచస్పతితోఁబడిన యవస్థ
లనెల్లనెఱింగించి "సంవర్తసంయమీంద్రా! ఇంకఁ బాలముంచి

నను నీటముంచినను నీదే భార" మని వేఁడుకొనినఁ గరఁగిన మనంబుతో "మహారాజా! నీ విసుమంతయు భయంబుఁ జెందకుము. నిన్ను మహేంద్రు విభవంబుమించు ప్రాభవో జ్వలుఁ గావింతు. నిన్నుం జూడ నాకుఁ గడుంగడు జాలివొ డముచున్నది. సకల లోకాలోకపర్యంత ధననిక్షేపంబులు నాకుఁ గరతలామలకములు. హిమవంతంబున కుత్తరంబున ముంజవంతంబను పర్వతరాజం బొండుగలదు. అందు గిరిజా సమేతంబుగ శంకరుండు యక్షకిన్నరకింపురుష గరుడోరగ సిద్ధసాధ్యులును దక్కుంగల భూతజాలంబులును సేవింప విలా సంబుగ విహరించుచుండు. మున మా తావునకుఁ బోయి శాంతమూర్తియగు శర్వుఁ బ్రస్తుతించి యాతని యనుగ్ర హంబు వడసిన మనకుఁ బసిఁడి గను లనేకంబులు లభియిం చుఁ గానఁ బోయివత్తమనుటయు నాతఁడు సంవర్తుతోఁ గూడ నతికుతుకంబున నేఁగి తదభీష్టంబు నెఱవేర్చుకొనియె. మరుత్తుం డంత ననంత ధనవంతుఁడై యుండెను. ఏ యజ్ఞవా టంబులఁ జూచినను కాంచనమయంబులే. ఏభాండాదిక్రియా సాధనంబులు విలోకించినను స్వచ్ఛకాంతుల నీను స్వర్ణమ యంబులే. ఏ శయ్యాసనాదులు చూచినను పుత్తడిమయం బులే. అంత సంవర్తుం డద్వితీయ ప్రాభవంబున యజనంబున కుపక్రమించె.

ఇదియంతయు నంతరంగంబునఁ దెలిసిన దేవగురుండు

కృష్ణపక్ష శశాంక కరణి క్షీణించు టిందుండు గాంచి " ఓ దేశికోత్తమా! సర్వస్వర్లోక రాజ్యరమావిభవంబు నీ హస్తగతంబై యుండ నీవిట్లు విగతోత్సాహుండవై యుండఁ గతంబేమి. నిన్నేదో వగపుటగ్గి దగ్ధమొనర్చుచున్నట్లు తోచెడిని. అట్లయిన వచింపుమనిన నాచార్యుండు కడుంగడు బెగడొంది మద్గర్భవిరోధి యగు సంవర్తుని మరుత్తుండు మహత్తరంబగు తన మఖంబున నధ్వర్యుగా నొనర్చుకొనె. అదియ మదీయ ఖేదకారణంబని వచియించె. అంత వజ్రి క్రోధోజ్వలితుండై సమీపవర్తియైన యనలుఁ గన్గొని "మరుత్తుపాలికిం బోయి సంవర్తు యాజకత్వం బుజ్జగింపుమని నావచనంబుగాఁ దెల్పుమనియె. మరుత్తుండును వచ్చినయగ్ని దేవు నతిభక్తిఁ బూజించిన పిదప సంవర్తసమేతుండగు మరుత్తున కగ్ని దేవుం డిట్లనియె.

"క॥ నీ జన్మమునకు ధిషణుఁడు
యాజకుఁడై మర్త్య నిన్ను నమరత్వ దశా
భ్రాజిష్ణుఁ జేయు నమ్మెయి
రాజితముగ నాచరింపు క్రతుకార్యంబున్॥"

ఇదియ మఘవుండు నీతో నొక్కచెప్పు మనిన విషయంబన మనుజపతి " హవ్యవాహనా! నే నాబృహస్పతి కడకేగి పదంబుల వ్రాలి పలువిధంబులఁ బ్రార్థించి యాజ

ఖండవు గహ్వరన నతం డదయాత నన్బరిహసించి త్రోసిపుచ్చి తుట్టతుద కెట్టులో నిమ్మహాత్ము సమ్మతి వడసి తోడ్కొని వచ్చితి. ఒక సామాన్య మానవుని యజ్ఞంబున కీతఁడు చాలునులే ” యని మోమోటమువీడి పల్కెను. అంత న నలుఁడు “ రాజా! ఆ దేవేంద్రుఁడే దుర్లభ్యంబులగు పుణ్య లోకంబుల సులభ్యంబులుగఁ జేయు నున్నవాఁడు. ఇంతకన్న మహాభాగ్యమున్నదే. ఇది సర్వశ్రేయంబుగదా ” యను పలుకు లా సంవర్తుఁ డాలించి “అగ్నిదేవా! నీవన్నిఁటి దగ్ధము సేతునని విఱ్ఱవీగుచు నోటికి వచ్చినట్లెల్లఁ బ్రేలుచుంటివి. ఇంక నిట్టి వ్యర్థప్రసంగఁబుల మాని తిన్నఁగఁబొమ్ము. కానిచో మద్భీకర కోపానలంబున కింధనమ వయ్యెదు సుమా” యని భయంకరంబుగఁ బలుకు పలుకులకుఁ బావకుం డులికిపడి యాకసమంటి యమరాధిపు పాలికిఁబోయి తన పరాభవంబు తెఱంగు విన్పించిన నాతఁడు కాలుగాలిన పిల్లివలె గంతులు వైచుచు “ ఏమేమి! నా పలుకు లాతని కింత యెల్లిదముల య్యెనే. వహ్నీ! నీవే యగ్నివై సర్వంబు దహింపుచుండ నిన్నొక్కరుఁడు దహింతునన్న పేదమాట మాత్రాన జంకివచ్చితివా. అజ్జనపతి నా ప్రతాపం బెఱుంగఁడు. నీవిప్పుడ మఱలఁజని నామాట గీటుపుచ్చినఁ గులిశంబుచేఁ దన్నరనిముసంబులో జముపాలి కంపుదునని తెలియఁబల్కు ” మనిన హవ్యవాహనుండు నవ్వి

"ఆ! మూఁడు లోకములును వాడి మగంటిమి
నేలు చున్నవాని నెట్లు వృత్రు
దాఁక్రమించె నిన్ను నడియును గాక ప
ర్జన్యమఱియు వినవె బ్రహ్మబలము."

ఇంద్రుండు గంధర్వలోకపతియగు ధృతరాష్ట్రు రావించి మరుత్తుకడకు దూతగాఁ జెప్పి పనిచె. అతండును మరుత్తు కడకేగి సంవర్తు సన్నిధిన నింద్రుని పంపుపెంపు సేసి చెప్పం దొడంగిన నారాజు సహింప నోపక వారించి "మిత్రద్రోహంబు మహాపాతకంబు గాదే" యని త్రోఁచిపుచ్చె. ధృతరాష్ట్రుండు కృద్ధుండై" అల్లదే వింటివా భిదురధ్వానంబు మహాప్రళయ ప్రభంజన నిస్వన సమంబుగ దివ్యాన నెక్లెంచెడినో కనుంగొను మనుటయే తడవుగా వైరి మారణ కారణోపకరణంబగు వజ్రం బనతి దూరంబునఁ దమ్మాక్రమింప వచ్చుచుండుట నృపుండు గాంచి భీతిల్లి సంయమినిఁ బ్రార్థించెను. యోగీశ్వరుండు మందస్మితుండై "రాజా! అద్దాని వలన మన కావంతయు భయంబు లేదు. సంస్తంభన విద్యా వైదుషీ విశేషంబున నవ్వజ్రంబు నడంచి, చిరసముపార్జిత విశేష తపఃప్రభావంబునఁ దక్కుంగలుఁ వైరుల నెల్లర నరగడియలోఁ గడదేర్తు" నని ధైర్యంబు సెప్పె. అంత కర్ణపుటంబులు గడియలు వడు నట్లార్చుచు వచ్చు కులిశంబు

నవలోకించియు నద్దాని నరకుసేయుక మునీంద్రుండు "ఓయీ ! దాని బాటింపక వేరొండు వరంబెద్దియైన వేఁడుము. మత్త పో మహిమంబున నద్దాని నవశ్యం బనుగ్రహింతు" ననె. ఇట్లు వారలిర్వురు మాటాడుచుండ బ్రాహ్మణశక్తికి భయం పడిన దానివోలె నత్యద్భుతంబుగ నవ్వజ్రింబట్టి నిలిచి పోయె. ఈ విచిత్రదృశ్యంబు గాంచి జేడత్యంతానందంబు నొంది "మహాత్మా! బలవైరి వైరంబు వీడి నిజబలంబులతో నధ్వరంబున కరుదెంచి నిజోచిత హవిర్భాగంబుల స్వయం బుగఁ గొనునట్లును, వెండియు నీయజ్ఞంబు సుప్రీతంబగు నట్లును వర మనుగ్రహింపవలయునని వేడుకొనె. అంత నంవర్తుం "డల్లదే! ఇంద్రాద్యమరగణంబు లేతెంచుచున్నవి చూడుమను" నంతలో వారు నానాముఖంబులనుండి దివ్యవన వచ్చి వ్రాలిరి. మరుత్తుండు సంతోషపులకిత గాత్రుండై హార్షాశ్రులు గనుకొలంకులఁ బొంగి పొరల నంవర్తు తోఁగూడ నెదురేగి వారికి నర్ఘ్యపాద్యాది పూజనంబు లాచ రించి పూర్వవైరం బుడుగుమని యింద్రునిఁ బ్రార్థించె. వెండియు నంవర్తుఁ జూపి "యిత్తాపసపతి బృహస్పతి స్వరూ పంబ. కావునఁ గ్రతు యాజకుండుగాఁ బ్రతిగ్రహించితి నని విన్నవించె. అనిమిషనాథుండు ప్రీతుండై "నీవలన సం తుష్టుండనైతి. ఈ సురగురు ననుజుండట్టివాఁడయగుడు సంది యంబులేదు. అన మునినాయకుండునాకనాయకుంగన్గొని"

"ఆ.వె॥ అఖిల లోకభర్త వమరేంద్రి నీవిట్టు
లాదరమున వచ్చు టరయ నాత
పంబు ఫలము గాదె పావనమూర్తి యా
రాజు క్రతువు బుణ్యరాశి యయ్యె॥"

నీవు సర్వకార్య నిర్వాహణ దక్షుఁడవు. నీ కృపావిలో కనంబులన నీక్రతు తంత్రింబులెల్ల నే వికలతలేక సార్థంబులై చెల్లు. ఈ రాజన్యచూడామణి భవత్కృపావిశేషంబునఁ బుణ్యాత్ములలో నగ్రిగణ్యుండై స్వర్లోకసుఖంబులఁ జూరగొనుగాత మని సమాదరణ పూర్వకంబుగాఁబలికిన పురందరుం డనిమిషులఁ గన్గొని "ఈ యజ్ఞవాటం బతిరమణీయం బుగ నలంకరింపుఁడని కొందఱు కిన్నరుల, నృత్యాద్యభినయంబులఁ జూపర నానందపరవశుల గావింపుడని కొంద అచ్చరలఁ బలువిధ సంగీత వాద్యవిశేషంబుల సదస్యుల కింపు నింపుఁడని కొందఱ గాంధర్వుల నియమించె. వారట్లు సకల కార్యంబుల నిర్వర్తింప సర్వంబు దానమై సురపతి సహాయ మాచరింప, వేరొక యగ్నిభంగి సముచితాసనాసీనుఁడై సంవర్తముని హావిర్విధానం బొనరింప యజ్ఞము సముజ్వలంబు ను సుప్రియోగకంబునై యొప్పారె. అనంతర మా ఋషి వృషభుండు వేర్వేర నెల్ల దివిజుల నాహ్వానించి హావిర్భాగం బులందీయ సహా ప్రనేతుఁ ఁడావి దివ్యులెల్ల రుల్లంబునఁ బెల్లు సంతసించి యామంత్రిణంబునొంది నిజనివాసంబుల కరిగిరి.

మేదినీవల్లభుం డవనీసురల కనేక భూరిదానంబుల నొసఁగి పరితృప్తులంజేసి మునీంద్రు నానతి నిజరాజధాని కరిగి వార్ధి వేష్టిత వసుంధరావలయంబుఁ బుణ్యాపరత వెలయఁ బెక్కేండ్లు పలించె.

## సుహోత్రు౧c

సీ॥ సన్మార్గమున రాజ్యసంపద నొంది భూ
సుర పూజలొనరించి సువ్రతముల
బృందారకులఁ బ్రీతిఁబొందింప దన కర్థిఁ
బర్జన్యుఁ డేటేటఁ బసిఁడి వాన
కనకవాయమ్ములైన కర్కటవృషభ నక్ర
కూర్మచయముతోడఁ గురియుచుండ
నయ్యర్థమెల్ల ధనార్థుల కిచ్చుచు
గురుజాంగలంబునఁ బరమనిష్ఠ
ఆ॥ నశ్వమేధ మఖములైన రాజార్హ య
జ్ఞములు పెక్కుసేసి సకల జనులు
పొగడునట్టి పాటి నెగడె సుహోత్రుఁడు
... ... ... ...

పుణ్యదంపతులకు భవ్యమాన్య సువర్ణలక్ష్మ వైరిశాసన పీఠి మహాత్ముండగు సుమహాత్ముండు పుత్రుండుగా జన్మించి, శుక్లపక్ష క్షపాకరు చందంబున దినదినాభివృద్ధి నొందుచుండె. జనకుండా బాలున కైదవయేట సకలశాస్త్ర పారంగతులగు నుపాధ్యాయుల రావించి, యక్షరాభ్యాసంబు గావించి పిదప నుపనయన సంస్కారంబు సేయించె. కాలక్రమంబున నా సుమహాత్ముం డెల్ల నిగమంబుల సంగమంబులుగఁ జేసికొని వివిధాయుధ ప్రయోగోపసంహార క్రమంబును, రాజ్యపరిపాలనా తంత్రంబును, నచిరకాలంబులోఁ బడసి, తోడిబాలుర కన్నమిన్నయై యెన్నికగాంచె. అతం డెలప్రాయ మంకురింప నమూల్యాంబరాభరణంబులఁ దాల్చి, సకల సామంతామాత్య పరివేష్టితుండగు రాజరాజు పజ్జ నాసీనుండగుతఱి నా రాకుమారు సంభావించి వారెల్ల రాతని జగన్మోహనాకారంబునకు నచ్చెరవడి తామెన్నఁడట్టి యసమాన రూపరేఖాజిత మన్మథుఁ గనివిని యెఱుంగమని తమలోఁ దాము గుజగుజలు వోవుచుండిరి. ఆహా! ఆసౌందర్యవిలాసము గాంచ వేయికనులైనఁ జాలవు. కావుననే యట్టి మనోహరాకృతిం గాంచి స్వాకృతి హీనతకుఁ జింతించి యతనుం డదృశ్యుఁ డయ్యె. సుధాంశుండు వెల్లనాయె. వసంతుండు వనములఁ బట్టె. వృద్ధరాజొకనాఁడు నవమోహనాకారుండగు తన కుమారునకుఁ బట్టంబుగట్టి పూర్వా

చారానుసరణంబున వానప్రస్థంబునఁ గాలంబు గడుప కుల కాంతతో దుర్గమకాంతారంబున కేగి శ్రీకాంతు నచంచల భక్తిఁ బూజించి తదనంతర ముత్తమలోకంబుఁ బ్రాపించె.

సుమిత్రాపుత్రుండు జనకు సింహాసన మధిష్ఠించి ప్రజలను శరీరముగను దా నాత్మ యట్లన్యోన్యానురాగ విరాజితుఁడై, జితేంద్రియుండై, పురీ నగర దుర్గద్వారంబులఁ గట్టి కాపుపెట్టి, శత్రురాజుల కొలువునఁ బ్రచ్ఛన్న వేషధారులగు బాంధవామాత్యమిత్రుల గూఢచారులుగ నియమించి, కార్ముకాద్యాయుధాగారంబులనెల్ల నాయత్తపఱచి సుశిక్షితులగు పరాక్రమవంతుల యోధులుగఁ జేర్చె. వెండియు రాజ్యాంగసప్తకముల నహర్నిశంబులు గన్నిడి చూచుచు, ధర్మార్థకామంబులను వర్గత్రితయంబు పాటించి, దుర్వ్యసనంబులఁ జిక్కుకొనక, మార్తుర సామాద్యుపాయంబులఁ జక్కజఱచుచుఁ బాలితుల జనకుభంగి నాదరించుచు ధర్మపాలనం బొనర్చుచుండె.

కొలదికాలంబున కా మహీకాంతున నైహికసుఖంబుల విరాగమొదవి మహీతలంబు మంత్రుల వశంబు గావించి పరాత్పర సందర్శనేచ్ఛాయత్తచిత్తంబునఁ దానొంటిగఁ దపమాచరింప సాంద్రారణ్యమున కేగె. అయ్యెడ నతఁడొక హిమఁసలిలకాసారంబు చెంత నిరాహారుండై నిశ్చల చిత్తంబున నీశ్వరు నారాధించుచుండె. ఒకనాఁ డాసరోవరంబున జలావగాహంబు సేయుచుండ

"క॥ కుఱుఁగనులు నలువ మీసలు
చిఱుదోఁకయు బసిఁడిమేను సిరిగల పొడలున్
నెఱిమొగము నొక్క కొమ్మను
మిఱిచూపులు గలిగి యొక్క మీనంబంతన్॥"

కనులు మిఱుమిట్లుగొలుప నాతని దృష్టిపథంబునఁ బడ నతఁడెన్నఁడట్టి యపూర్వశృంగారవైభవోపేతంబగు గండకంబును గాంచియెఱుంగమి నద్దాని యందచందంబుల కెంతయు జొచ్చవడి యచ్చెరువుగఁ జూచుచుండ నా మీనరూప మాతని చిత్తఫలకంబున దిటవుగ నాటుకొనియె. అంతఁబోఁక మగిడి యా కమలాకరంబు చెంగట యథాపూర్వకముగ జన్నంబొనరించుచున్న నృపాలున కా పాఠీనాకృతి గనులకుఁ గట్టినట్లుండె. ఇటులఁ గొన్ని వత్సరములత్యుగ్రశైత్యాతపంబుల కోర్చి ఘోరతపంబుసలుప దీనావనుండగు గోవిందు డిందిరావధూటితో ఖగవాహనారూఢుండై చనుదెంచి వాత్సల్యమేపార "బిడ్డా! నీ నిరంతర తపోనియతి కెంతయు సంతసించితి. ఇచ్చవచ్చిన వరంబు గోరుకొమ్మిచ్చెద నని యభయప్రదంబగు దక్షిణకరంబు శిరంబున నిడె. రాజర్షి లేచి నిలంబడి, సందర్శనానందంబున మేను గగుర్పొడువఁ గనుకొలంకుల సంతోషాశ్రులొల్క సభక్తికంబుగఁ బ్రణతు లొనర్చి

"ఉ॥ ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభులీల లద్భుతము లెవ్వని సంశ్రవణంబు సేయ దో
షావళి బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగువందు నే
నా విభునాశ్రయించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్"

అని ప్రార్థించి" ఆశ్రితజనపారిజాతమా! మానీంద్ర దుర్లభంబైన నీ దివ్యసందర్శనం బొసఁగి నను నెంతయు ధన్యుఁ జేసితివి. భక్తవత్సలుండవగు నీ నిర్హేతుక కరుణావిభవంబు పడయఁగల్గిన నాకు వేరు వరంబులతోఁ బనియేమి? నీ సాన్నిధ్యలాభం బొసంగి నన్ననుకంపఁ బ్రోవుము అన ముకుందుఁ డెంతయు సంతసించి " నా సాన్నిధ్యలాభంబు నీకుఁ దుదిఁ బ్రాప్తింపఁగలదు. వెండియు నీ చిత్తవృత్తినారసి నీకొక విచిత్ర మత్స్యంబు నొసఁగితి" నన జనవిభుండు "ఈశా! ఇదియేటి వరంబు. మున్ను మున్ను తేఁడు లిట్టిదానిఁ బొందినట్లుఁ బొడఁగట్టరని విస్మితాత్ముండై పలుక నారాయణుండు మందహాసంబు సేయుచు "నాఁడు తటాకంబున స్నానమాడుచు జలంబులఁ దిరుగాడు నొక మీనంబును గాంచి యెంతయు విభ్రాంతుండవగుఁ డా జలచరరూపంబు తపశ్చరణకాలంబున నీ మనస్సీమయందు హత్తుకొనియె. అయినను దీన నష్టము వాటిల్లనేరదు. ఇది పసిఁడి మీనమగు నట్లనుగ్రహింతు. నీ వీమత్స్యరాజంబును గొనిపోయి భక్తిశ్రద్ధలతో నొక పవిత్రస్థలమున నునిచి యనుదినమును

బూజింపురు. ఇమ్మహాత్మ్యమున నేఁటట వానకారునఁ బసిఁడివాన సువర్ణమయంబులైన హాటకరఘుషనక్రకూర్మంబులతోఁ గురియుచుండు. ఈ మత్స్యరాజంబుండు దేశంబు క్షామ చోర వ్యాధి భయంబులులేక సదా లక్ష్మీనివాసంబై యుండు. కావున నిద్దానిఁ గైకొని పురంబునకేగి మత్సాన్నిధ్యంబు లభ్యంబగుడనుక రాజ్యంబేలుచుండుమని యదృశ్యుండయ్యె.

అల్పనంతోషితుఁడగు నా భూపాలుఁ డా యమూల్యనిధానంబు నమితామోదంబున గైకొని పురంబుఁ జొరఁ బురవాసు లా ప్రభునిరాకఁ గాంచి చంద్రికాచకోరన్యాయంబున నుత్సాహంబుతో నుబ్బి తబ్బిబ్బులైరి. పుడమీశుఁ డాక్షణము విప్రోత్తముల రావించి, సౌధాంతరంబున నొక నిగూఢస్థలంబున నద్దాని సమంత్రకంబుగాఁ బ్రతిష్ఠించి ధూపదీపనైవేద్యములతో ననుదినము నిర్ణీతకాలంబున నర్చించుచు యథావిధి రాజ్యపాలనంబునకుఁ గడంగె. ఈ జలచర ప్రభావంబున నాతని దేశమంతటను దెల్లెడల వర్షాగమంబునఁ గనకవర్షంబు కాంచన మత్స్యమకర కచ్ఛపాదులతోఁ గురియుచుండ జనులెల్లరు గుంపులుగట్టిపోయి యావిచిత్ర దృశ్యంబుగాంచి యద్భుతామోదంబుల నొందుచుండిరి. కాని వారలలో నొక్కరుంగూడ నదొకటియు ముట్టనైన ముట్టరు. రాజు వానినెల్లఁ దెప్పించి భాండాగారంబుల భద్ర

పరపించుచు నర్థుల కయాచితంబుగా దానంబు లిచ్చుచు నిందప్రీత్యర్థ మనేకయాగంబులఁ జేయుచు ధర్మమార్గం బునఁ బ్రజలఁ బాలింపుచుండె. కొలదివత్సరంబుల కా నృపాలు రాజ్యమం దేమూలఁజూచినను కాంచనరాసులే. అది శ్రీదేవి కాటపట్టయి ధనదునిప్రధాన పట్టణంబగు నలకాపురిఁ జులకనసేయుచుండె. వెండియు నా మహీత లేశ్వరు నష్టైశ్వర్యసంపన్నతయును, విఖ్యాతదానపరతంత్ర తయును, ప్రజానురంజకత్వమును దిగ్దేశంబులకుఁ బ్రాఁకి సర్వజన శ్లాఘాపాత్రమై యొప్పె.

ఈ యుదంతంబు గర్ణాకర్ణిగ జంబుకేశ్వరుఁడను రజనీచరాధినాథుం డాలించి, తన్మూలకారణం బా విష్ణు ప్రసాదితహేమమత్స్యంబని తెలిసి, యార్తిఁజెంది, దాని నెక్కరణినైన నపహరింపనెంచి, బహుమేధాసంపన్నత్వం బున వాచస్పతి కీడగు నమాత్యశేఖరుఁ బిల్పించి మనోగ తాభిప్రాయంబు వెల్లడించె. అతఁడు స్వామీ! ఇదెంత పని, సఫలీకృతకార్యుండనై వత్తు. శీఘ్రంబ నన్నను వుఁడు॥ అని విన్నవింప దానవనాయకుఁ డంముల కియ్యకొనె. అంత నాతఁడు ప్రచ్ఛన్నవేషంబున శతుప్రనగరంబు సొచ్చి ప్రతి గృహంబున కరిగి యాగతానాగతంబులఁ దెల్పుచు నందర దనియింపుచు వారలవలన నే కొద్దిరూకలనో పారితోషికం బుగఁ గొనుచు జీవయాత్రతోఁబాటు తదప్రహాస్యభేదనో

పాయంబుగూడ నరయుచుండె. కొన్నినాళ్ల కా నూతన పురుషు పాండితీవైదుష్యమున కెల్లరును ముగ్ధులై యాతని ననేక విధంబుల నుతింప మొదలిడిరి. ఒకనాఁడు తేఁడుగూడ నాతనిఁ బిల్పించి సముచితసత్కారంబుల సమ్మానించి సంస్థాన విద్వాంసునిగ నుద్యోగించె.

నాటినుండియు ననుదినమవనీశు దర్శింపుచు, నాత నితో నెల్లదేశంబులఁ దిరుగుచు, నడుమనడుమఁ బరిహాస వచన నిచయంబులచే మనోల్లాసంబు గల్పించుచు నచిరకాలములో నాతని కాప్తమిత్రుం డయ్యె. ఒకనాటి ప్రభాత మున రాజు పూజామందిరమున కరుగుచుండ నాతఁడును వెన్వెంటఁజని యా జలచరంబును దన్నివసితచర్మపేటిక యుఁ దత్సంబంధవిషయంబులనెల్ల నతిశ్రద్ధగఁ బరికించి యర్చనానంతరమున నధిపుతోఁగూడ నిజావాసంబునకరిగె.

ఆ వంచకుఁ డొకనిశీథంబున మూలసౌధంబు సొచ్చి సుస్థాపితంబగు నా హేమమత్స్యంబుఁ జూడఁబెరికి, యద్దాని పోకడ దెలియకుండునట్లు, తత్సమీప వస్తువులనెల్ల యథా స్థానంబులఁ గ్రమపద్ధతి నునిచి, నిజచౌర్యకళాకౌశలంబు మెఱయ నద్దాని నపహరించుకొనిపోయి దైత్యేశ్వరున కర్పించి వాని యనుగ్రహంబునకుఁ బాత్రుఁడయ్యె. రా జేందుఁ డెప్పటియట్లనుదినమును బోయి మత్స్యమును బూజించి వచ్చుచుండెను.

అంతఁ గొంతకాలంబునకు వర్షాగమం బేతెంచెను. తొలుత నంబరవీథి సాంద్రనీలనీరదాచ్ఛాదితమై భాను బింబంబు గప్పి తోఁచకుండెను. పిదప గిరిగిరి ధ్వనులు ఫిరంగిమ్రోతలకరణి భయంకరధ్వానంబులఁ జేయు చుండె. వానికిఁదోడుగ గనులు మిరుమిట్లు గొలుప నందంద మెఱుపులు తళుకుతళుక్కని మెఱయుచుండె. అంత శీతల వాయువు లెల్లెడల వీవఁజొచ్చె. అత్తఱి పవనసంచలితంబు లైన నీలమేఘంబు లాకాశంబున నసితవారణంబుల వడువు న విహారంబు సల్పుచుండెను. పాశ్చాత్యులమేఘుఁడు ధరణిపతికి నర్పించు కర్పూరఖండంబుల భాతి, నీలమణుల సొబఁగున, సన్నజాజుల చందంబునఁ జిటుకు చిటుకున చిరు చినుకు లారంభమయ్యె. అంత నల్లరి పిల్లలెల్లరుఁ దమతమ గృహంబుల బాలశాలల వీడి యాటపాటల గంతులువైచి యార్చుచు నవ్యక్తానందంబు వెలిపుచ్చుచుండిరి. పిదప వలు ద చినుకులు బడబడధ్వనుల నొడళ్లఁ దడుపుచు నేలఁగమ్మని నెత్తావులీన మూలనడఁగియుండిన గుడ్డగొడుగుల దాటి యాకుఛత్రంబుల బూజుదులిపి వేసికొని పోవువారును గొందఱవి లేమి కించవడి పంచలకు నొదుగువారునునై యుండిరి. ఆవ్వల నింగికిఁ జిల్లులువొడిచినట్లు, భూమ్యాకాశం బులకు వెండితీగలు బిగించినతీరునఁ దొల్తఁ దొండంబులతో నట్టుపైఁ గుంభంబులతో నెడమడుగుగఁ గుర్సిమ్మరింప వీథుల

కిరుదెనలఁ గాల్వలుగట్టిపాఱె. తలిదండ్రులు పోవలదని యెంతయార్చినను విన్పించుకొనక, తఱియుటకు శంకింపక బాలురు కృత్రిమనౌకలఁ గల్పించి జలంబులఁ దేల్చి యపరిమితానంద మొందుచుండిరి. ఎల్ల నదీనదంబులును, వాపీకూపతటాకాదులును జలసమృద్ధములై యొప్ప జలచరంబు లుత్సాహంబునఁ బొంగుచుండె. కర్షకు లమితహర్షంబున లాంగలంబులఁ గైకొని సేద్యంబు సేయఁజనుచుండిరి. అంత జడివాన మగుడ నభంబున నింద్రచాపంబు పలువర్ణంబుల నొప్పారె.

కాని యాప్రాంతభూములఁ దొల్లిఁటివలెఁ గనకఝషకర్కటాదులఁ బసిఁడివాన గురియమి నృపుఁ డచ్చెరువడి మరునాఁ డెప్పటియట్ల పూజాగారంబున కేగి పూజాద్రవ్యంబులఁ దొలఁగించిచూడ నందలి మీనంబు కానఁబడదయ్యె. అంత జనపతి వికలమతియై సకలసామంతామాత్యపురోహిత పౌరవర్గంబుల రావించి యావద్వృత్తాంతమును బూసగుచ్చినట్లు వచించి "అయ్యా! ఇప్పుడే దేశంబు సుభిక్షంబుగా నుండెనో వచింపుడు అచ్చట మన పసిఁడిమీను తప్పకయుండును" అని వచింప నొకగూఢచారి, "ప్రభూ! జంబుకేశ్వరుండను దైత్యేంద్రుఁడు గలఁడు. అతని రాజ్యంబునఁ గాంచనమత్స్యకచ్ఛపాదులతోఁ బసిఁడివాన గురియుచుండె నని వినియుంటి. రాజు సంతసించి " అమాత్యవరులారా! వింటిరా! ఆగూఢచారి విన్పించినవృత్తాంతము. ఆ

కపటజ్యోతిషుండు దానవేంద్రుని సేవకులలో నొకఁడు. అతఁడు ప్రచ్ఛన్న వేషంబునఁ జనుదెంచి మిత్రద్రోహ మొనరించి యుండనోపు. కావున వారలనందఱ నాహవరంగమున నా బాణాగ్నికాహుతిగావించి యామీనంబును గొనిరావలయు. మీమీ సేనల నెల్ల నాయత్తపరపుఁడు. రేపే ప్రయాణము" అని ప్రోత్సహించి నిర్ణీతదినంబున దనుజులఁ జెండాడఁ జైత్రయాత్ర వెడలె.

ఇట్లు లానృపాలపుంగవుం డపరిమితసేనావారంబుతోఁ బల్లెలఁ బట్టంబుల గడచి కతిపయదినంబుల కారాక్షసేశ్వరు రాజధాని డాయంజని జయభేరి మ్రోయించె. అట నంతఃపురమున హాయిగ శయనించిన యసురనాయకుండులికిపడిలేచి, మంత్రివర్యు రావించి, పట్టణంబు శత్రుహస్తగతంబు గానున్నదని తెలిసి, మొనలఁగూర్చుకొని యనికిఁ జనియె.

అంత నుభయసైన్యంబులును మోహరంబునకుఁ దలపడి రథికులు రథికులను, గజారూఢులు గజారూఢులను పదాతులు పదాతులనుదాఁకి, సింహనాదంబులు సెలంగ నన్యోన్యతిరస్కారంబులఁ జేయుచు, భుజాస్ఫాలనంబులఁ గావించుచు నొండొరులపై వివిధాయుధంబులఁ బ్రయోగించుకొనుచుఁ గొంతవడి సంకులసమరంబు సేసిరి. అంత సుబాహాత్రుండు నిజబలంబులఁ బ్రోత్సహింప, ధైర్యోత్సా

హంబు లినుమడింప నతిరౌద్రాకారులై పరబలంబుల మా ర్కొని రథంబులఁ గూల్చియుఁ గరితురంగంబుల నొంచియు శత్రువీరుల నుక్కడించియుఁ బెక్కుతెఱంగుల మెఱసిన విరోధివర్గంబు బెండువడి నలువలంకులకుఁబాఱ, దైత్యుఁ డన్యథాశరణంనాస్తి యని మత్స్యంబునిచ్చి యాతని పదంబులఁబడె. అతఁడు కరుణాతిరేకంబున యాతనిఁ బ్రజలతోఁగూడ క్షమించి విడిచె. రక్కసులు వాని యపార కృపావిశేషంబున కక్కజంబడి వేనోళ్ల వినుతింపుచు నుపా యనంబు లొప్పనంబుసేయుచు బద్ధసఖ్యులైరి. పరగాఢ్ఢి కరుండగు సుహోత్రుం డంత విపులహర్షంబుతో జయ లక్ష్మీకరగ్రహణంబు గావించి మగిడి నిజరాజ్యంబున కే తెంచి యుత్సాహసూచకంబుగఁ బట్టణం బంతట నుత్సవం బుల జరుపవలయునని చాటఁబంచె. మరునాఁడు బీదసాదల కుచితముగ నిష్టమృష్టాన్నంబుల నిడి పలువిధ దానంబులఁ జేసి వారల నందఱఁ బరితృప్తులఁ గావించె.

పిమ్మట గురుజాంగలంబునఁ దురీనశ్వమేధంబు సభక్తి కంబుగ నొనర్ప నవనభూమి బంగరు లాంగలంబుల దున్నిం చి యాప్రదేశ మంతట యజ్ఞవాటికల నిర్మించె. వెండియు నాజన్నంబునకై స్వర్ణమయోపకరణంబుల నమర్చి, మంత్ర తంత్రలోపంబు వడనీకుండ నవనిసురలఁ జూడనియమించి సువర్ణరత్నధనధాన్యవస్తువస్త్రప్రకరంబుల వేత్యేర భద్రిం

బుచేసి, వానిఁ బంచిపెట్టుటకును, షడ్రసాన్నపానాది సకల పదార్థంబులఁ బాకంబుసేయించుటకును, నాహుతుల కాతిథేయ మిచ్చుటకును వేర్వేరఁ గొందఱ నేర్పఱిచి, తాను దీక్షితుఁడై, భూసురాశీర్వాదంబులు సెలంగ, మంగళ తూర్యారవంబులు మినుముట్టఁ గ్రతువున కుపక్రమించె. అవనీశుం డగ్నిముఖంబున నమరుల నాజ్యాహుతుల నానందింపఁజేసె. ఆవెన్కఁ సదస్యులనెల్ల బహువిధదక్షిణల భూరిదానంబులఁ దనిపి యవభృథస్నానమాచరింప, నాకసమున దేవదుందుభులుమ్రోయు, సురలు విరులవాన గురిసిరి.

సుహోత్రుండు దారాపుత్రాదులతోఁ జిరకాలము రాజ్యమేలి వార్ధకమునఁ దనయునకుఁ బట్టంబుగట్టి భక్తిజ్ఞానవైరాగ్య సంపదలుఁ బెంపెనఁగ నాదిదేవుండు మెచ్చి విమానంబు పంప నందాసీనుఁడై దివ్యలోకంబు సేరె తనంతర మాతని పుత్రుండు హస్తి దనపేర హస్తినాపురంబు నిర్మించె.

# దిలీపుఁడు.



సీ॥ సూర్యచంద్రప్రభాచౌర్య ధౌరంధర్య
శౌర్యకీర్తిద్వయీ సంగ్రహుండు
ద్వీపాంత రాగతోర్వీపాల నివహాని
తోర్వ్యుపాత్త వివిధ రత్నోపదుండు
చండదోర్దండ కోదండ నిర్యత్కాండ
ఖండితోద్దండారి మండలుండు
భద్రదానోదక విద్రావిత సముద్ర
ముద్రితక్ష్మాశ్రిత లోపద్రవుండు
గీ॥ జైత్రయాత్రావసరసము జ్జనిత భేరి
కా భయంకర చటుల భాంకారదళిత
వనజగర్భాండు డర్థిహృద్వాంఛితార్థ
దాయకుండు దిలీపభూనాయకుండు॥

రఘువంశమున కాదిపురుషుఁడు సూర్యభగవానుఁడు. ఆతనికి వేదంబునకుఁ బ్రణవము వలె రాజులలో నగ్రగణ్యుఁడైన వైవస్వతమనువను కుమారుం డుద్భవించె. పయఃపారావారమందు సుధాకరుం డుదయించు చందంబున నాతని పవిత్రాన్వయంబున దిలీపుండను రాజవరేణ్యుఁ డుదయించె.

ఆ పురుషసింహుండు విశాలవక్షస్థలుండగును, నాజానబాహుం డును, నరవిందదళాయతేక్షణుండును, జ్ఞాతోశ్రిచితపరాక్రమవంతుండునునై ప్రకాశించుచుండె. ఆ మహారాజు తేజః ప్రతాపాది గుణములచే నరివీర భయంకరుండును, దయా దాక్షిణ్యంబులచే స్వాశ్రితులకు ముఖ్యపాపకుండునునై యొప్పుచుండె. వెండియు నిపుణుఁడగుసారథి రథచక్రంబులఁ జిరపరిచితమార్గమునమండి లేశమైనఁ దప్పిపోవనీక యేవిధం బున నవ్యంబుగా నడిపించునో యటుల పాలితుల సదాచా రములనుండి తొలఁగనీక సర్వదా గాపాడుచుండె. అతఁడు నృపతులకడఁ గప్పంబుల నుచితభంగిఁ గొనుచు దేవతలకుఁ దృప్తిగలుగఁజేసి యుక్తకాలంబున వర్షంబులగురియించుటచే భూమి సకలసస్య సమృద్ధంబయ్యె. అనంతర మతఁ డత్యుత్త మంబగు మగధవంశంబున జనించినదియు దాక్షిణ్యఖనియు నగు సుదక్షిణాభిధాన నుద్వాహమయి, యన్యోన్యానురా గంబునఁ బొదలుచు ననేకవత్సరంబు లమితానందమున గడపె. కాని సంసారవృక్షమునఁ బుత్రఫలము వొడమకుంట చే రాజ్యపాలనాభార మమాత్యులపై నిడి యొక శుభ దినంబునఁ బ్రియురాలితో నరదమెక్కి మునిశ్రేష్ఠుఁడైన వసిష్ఠు నాశ్రమంబునకుఁ బయనమయ్యె.

వారట్లు పుష్పఫలభరితతరుచ్ఛాయలఁ బోవుతరిఁ గుసు మసౌరభమిళితములగు వృక్షశాఖలఁగదల్చుచుఁ బుష్పాదుల

సొగఁజిమ్ముచుఁ, బరిపక్వఫలంబుల నిలఁగూల్చుచు, జగత్ప్రా
ణుం డెల్లప్రాణులకు హాయిగూర్చుచుండెను. అందమఁ
జిరుమబ్బులఁ గాంచి యానందంబున నొడళ్లు మరచు మ
యూరంబులు ఫించంబుల విప్పి నృత్యంబులు సేయుచుండె.
రథచక్రంబుల వెంబడించు భీతహరిణశాబకంబుల నేత్రం
బుల సొగసు దిలకింపుచు నంబరవీధి బారులుదీర్చిపోవు సా
రసపక్షులఁ బలుమరు శీర్షంబులెత్తి చూచుచుఁ, బరిసరసరో
వరంబుల విరాజిలు పద్మగంధంబుల నాఘ్రాణించుచు, నడు
మనడుమ విప్రోత్తముల యర్ఘ్యపాద్యాదిపూజల నాశీర్వా
దంబుల నందికొనుచుఁ, దోవంగాన్పించు గొల్లపిల్లల నచటి
వింత వృక్షంబుల నామంబు లడిగి తెలిసికొనుచు, నాయా
విచిత్రంబులఁ దన యాలికింజూపుచు మార్గపరిశ్రాంతి నొం
దకయే ఋషీశ్వరు నాశ్రమంబుఁ జొచ్చె.

జనపాలుఁ డరదంబు డిగ్గి తన దేవింగూడ డించి యు
శ్వము సేదదీర్పుమని సారథి కాజ్ఞాపించె. తదనంతర మా
రాజదంపతు లరుంధతీవసిష్ఠులకుఁ బ్రణమిల్లఁ దపసిమిథున
మత్యాదరంబున సుదక్షిణాదిలీపుల సర్వశుభము లొదవు
గాత" మని దీవించి బంధుమిత్రామాత్యుల క్షేమ మరసిరి.
అంత నృపుఁడు మహాత్మా! బ్రహ్మవంశోద్భవులైన తాము
గురువులైయుండ నా సంపద లాపద్రహితంబులుగా, నవిచ్ఛి
న్నంబులుగా నేల సాగకయుండును. మరియు నా రాజ్యమం

దలి ప్రజలు నిజాశ్రమధర్మంబుల విధ్యుక్తంబుగ నాచరిం పుచు, క్షామచోరవ్యాధి భయవిరహితులును, శ్రీమంతులు ను, శతవత్సరజీవులునై యుండిరి. కాని మాకుఁ బుత్రరత్నం బు లేమి దుర్గశమనంబును, బితృఋణవిమోచనావిధానంబును గాన్పింపమి కెంతయు వంతనొందుచున్నారము.

"తాము నిగ్రహానుగ్రహాసమర్థులరగుట మీా కె య్యెడ నసాధ్యంబులేదు. కావున నా విన్నపమాలించి మా కుతుకం బీడేర్పు" మని సవినయముగ వేఁడుకొనె. మునీం ద్రుఁడు వారలు సంతానహీనులగుటకుఁ గారణ మంతరదృ ష్టి నెఱిఁగి "తొల్లి దేవేంద్రు దర్శించి మగిడివచ్చుచు మార్గ మధ్యంబునఁ గామధేను వమరతరుచ్ఛాయ శయనించియుం టఁ గాంచియుఁ గొండొకకారణంబున నద్దానికి బ్రదక్షిణ నమస్కారముసేయక వెడలిపోయితివి. అంత నది మండిపడి నా సంతతి నీవారాధింపకయు సంతానంబు గలుగకుండుగాక యని నిన్ను శపించె. ఆ తరుణముననే దివిజస్రవంతి యం దొక మదేభము జలపూరణము సేయుచుండ నమ్మహారావ ములో నద్దాని నీవుగాని నీసారథిగాని వినఁజాలరైతిరి.పూజా ర్హులగువారినిఁ బూజింపమి శ్రేయోబంధకముగదా. కావున నా వేల్పుటావుపుత్రిక నందినీధేనువును భార్యాయుతుం డవై పూజింపుము. అద్దాన నది సంతసించి నీ యభిమతం బీడేర్చు" ననె. ఇట్లు వారు సంభాషించుచుండ నదృష్ట సూ

చకంబుగ నందినీధేనువు రత్నవనంబునుండి యట కేతెం
చె. వసిష్ఠుఁడు! రాజా! శుభప్రదాయినియగు నందినీధేను
విపుడ చనుదెంచుట మీ యిష్టార్థ మతిత్వరలో సిద్ధించు
నని సూచించెడిని. కానఁ గడుభక్తిశ్రద్ధల నిరంతర మీ ధే
నువు ననుసరించుచు సుప్రసన్నురాలిం గావించుకొనుము.
అది బయలువెడలెనా నీవును బయలువెడలుము. ఒకచో నిలి
చెనా నీవును నిలువుము. నీ భార్యయు నమితభక్తి నుదయ
మున నందినీధేనువువెంటఁ దపోవనమువఱకును బోయి
మరల సంధ్యవేళ నెదురుగా జని తోడ్కొనిరావలయు.
మీ రిటుల దానియనుగ్రహంబునకుఁ బాత్రులగు దనుక
దాని శుశ్రూష సేయవలయు. అంత నీ కేవిఘ్నంబును లేక
నీ జనకునకుంబలె సత్పుత్రుండు జన్మించు"నని యానతిచ్చె
తదుపరి వసిష్ఠు నానతిఁ గాలోచితంబగు దర్భశయ్యపైఁ గొ
లఁది తడవు విశ్రమించి శిష్యుల వేదపఠనంబుచే వేకువ మే
ల్కాంచి నిత్యకృత్యంబులఁ దీర్చికొని, సతీమణిచే నందినీధేను
వును జందనాగరుచర్చలతోను, నత్తావుల జిమ్ము నలరుదం
డలతోను సాలంకృతగావించి, మొదవును బాలుద్రావ
నిచ్చి ధేనువును వనంబునకై పోవిడిచెను. రాజపత్నియుఁ
గొంతవఱకు వెంబడించి గృహోన్ముఖురాలయ్యెను. తాఁ
డన్య సహాయం బపేక్షింపకయ సారవంతంబులగుపచ్చిక
బయళ్ళ లేబచ్చికల నోటికందిచ్చుచు, నడవియీగలఁ బోఁ

ద్రోలుచు, నడుమనడుమ గంగడోలు గీరుచు, నిరాటంక ముగా సంచరించుట కనువగుమార్గంబు సేయుచు, ముని మండనుఁ డానతిచ్చిన తెన్నున సత్యంతాసక్తి శుశ్రూష పరతనుండె. వ్రతాచరణదృఢసంకల్పుఁడగు నా భూపాలుఁడు శరచాపంబుల ధరియించి వనంబునఁ బ్రవేశింప వర్షము లేకయే దావానలము శాంతించె. వ్యాఘ్రాదిఘాతుకమృగంబులు దుర్బలక్షుద్రజంతువులఁ బీడింప మానె. అట్లు కొంత తడ వా ధేనువు తనసంచారముచే నావనముఁ బావనము సేసి వెనుకకు మరలెను.

అది యిలు సేరగనే పట్టమహిషి యక్షతలపాత్రిచేఁ బట్టుకొని ప్రదక్షిణ నమస్కారంబులఁ గావించి శృంగమధ్యప్రదేశంబున స్వకార్యసిద్ధికై పుష్పాక్షతలఁ బూజించె. అద్దానినంతయు నందినీధేనువు లేఁదూడకుఁ బాలీయ నిచ్చగలదయ్యు నిశ్చలురాలై సంతసముతో గ్రహించె. అవనివిభుఁ డిల్లాలితోఁగూడఁ దపస్వికి నమస్కరించి సాయంసంధ్యాద్యనుష్ఠానములఁ దీర్చికొని పాలుతీసిన పిమ్మటఁ గామితఫలప్రదాయినియగు నందినీధేనువు సేవించెను. ఇట్లమ్మహానీయకీర్తి భార్యతోఁగూడ నిరువదొక్కదినంబు గోవ్రతంబు సల్పెను.

మఱునటి దినమున ధేనువు గంగోదక పతనస్థల సమీపంబునఁ బొలుపొందు హిమవన్నగంబు నందలి యొక

గుహాం జొర నొకపంచాస్య మాధేనువు పైఁబడ ఱాలున దుమికి బలవంతముగా నంతర్భాగమున కీడ్చుకొనిపోయె. అంత నద్దాని యాక్రందన మాలకించి వీనుల సోఁక, శోకక్రోధము లుల్లంబునఁ బెల్లుగా ధనుర్ధారియగు నా క్షత్రియవీరుఁడు దన్నలక్ష్యంబు సేసి మొగవును జంప నుంకించిన హర్యక్షం బునుగూల్ప నమ్ములపొదినుండి బాణములఁదీయఁబ్రయత్నిం చెను. కాని యా శూరాగ్రేసరు హస్తమా తూణీరంబున నుండు నలుగులనత్త నుద్యోగింప నది చిత్రంబున వ్రాసిన ప్రతిరూపవలెఁ గదలఁజాలకుండెను. ఈవిచిత్ర సంఘటనంబున కచ్చెరువడియు నధైర్యంబునొందక సమావర్తియగు నైరి పైఁ దన శక్తి నుపయోగింపలేక మంత్రబలముచే నిర్విణ్ణాం బైన సర్పంబువోలె నాతఁడు క్రోధోజ్జ్వలితుఁడై ఘూర్ణిల్లు చుండె. అత్తఱిఁ గేసరీ పరితాపయుతుండయ్యు నిజబాహు స్తంభన కాశ్చర్యమొందు నారాజుఁ గాంచి మృగరాజు మందస్మితంబున మనుష్య భాషణంబుల "రాజా! నీవెట్టి ప్ర యాసమును బడనక్కఱలేదు. నీవెట్టియస్త్రంబుఁ బ్రయో గించినను నాయెడ నవియెల్ల వ్యర్థములే యగు. నేను శివ కింకరుఁడనగు కుంభోదరాఖ్యుఁడ. నీ మ్రోలఁ గాన్పించు దేవ దారు వృక్షంబును పార్వతీపరమేశ్వరులు పుత్రప్రేమఁ బెం చుకొనుచుండ నొకప్పుడొక వనగజంబు మిక్కుటంబగు కం డూతిచే నద్దానిపై రాయ నాతరువు బెరడూడె. అదిచూచి

పార్వతి మున్నొకప్డు రాక్షసుల బాణహతిచే నొచ్చిపడి యున్న కుమారుఁగూర్చి యెంత పరితపించెనో యంతకు రెండింతలు దుఃఖించెను. అది మొదలడవియేఁ నుగుల భీతిచే నీశ్వరుఁ డీసింహరూపము నాకిచ్చి యిత్యోడ కరుదెంచు జంతువులనాహారముగఁగొని యిందుండ నియమించె. భోజనకాలమునకు సంభవంబైన దీని శోణిత పారణము రాహువునకు జంద్రసంబంధినియగు సుధ చందంబున నాకొన్న నాకు మిగుల నానందమొసవించెడిని.

ఉపాయశూన్యుండవగు నోరాజా! నీవు గురుభక్తి గలవాఁడవే. ఈధేనువురక్షింపఁబడఁదగినదియే. కాని యాయుధములచే రక్షింపఁబడరాని ప్రతిబంధకముగల్గి యశక్యమైన దాని కీవేమి చేయఁదువనె. ఇట్లు రాజేంద్రుఁ డతి ప్రౌఢములగు మృగేంద్రు పలుకుల కులికి యీశ్వరప్రభావంబునఁగలిగిన యస్త్రవిఫలత కచ్చెరువొందియు ధైర్యంబు సెడక మనంబున నవమానముగాఁ దలంపక యిట్లనియె. చరాచరసృష్టి స్థితిలయంబులకు హేతుభూతుండైన పరమేశ్వరుండు నాకుఁ బూజ్యుండు. అంకాగతసత్వవృత్తిగల నీవు నాశరీరమువలన నాకలిదీర్చుకొని నన్ననుగ్రహింపుము. సాయంసమయున నాతల్లివచ్చుంగదా యని మిక్కుటంబగు నాశతో నెదురుచూచు లేఁదూడగల యీధేనువును విడువుమని వేఁడుకొనె. రాజుశాంతవచనంబులకు సింగంబు మఱి

దస్మితంబు చేసి "ఏకచ్ఛత్రమగు జగత్ప్రభుత్వమును, నూత్న యౌవనంబును, సుందరదేహంబునుగల్గి ప్రయోజనంబు గుర్తింపక స్వల్పలాభంబున కవ్యక్తునివలె వీనినేల పోనాడు కొనెదవు. నీవు భూతదయచే ప్రాణంబుల వీడుమనంటివా యీయావొక్కటి మాత్రమే జీవించును. ప్రజాపరిపాలకుండవగు నీవు జీవించిన సకలజనులను దండ్రివలె నెల్లపుడుఁగాపాడుచుందువు. ఇంతియకాక యిద్దానిఁ గోల్పోవుటచే వసిష్ఠు నాగ్రహంబు సహింపఁజాలనని వెరతువేమొ? నీవు కోట్లకొలది గోవుల నొసఁగి శాంతినొందింప సమర్థుండవుగదా వెండియు నీయావు నుపేక్షించిన నిందాపదవి లేదని యెంచెదవేమో! బుధులు సకలవస్తు సమృద్ధంబైన ధరణీవలయము నింద్రపదవి కీడని వచింతురు" అని హితబోధ గావించె. అతి దీనవదనంబుతోఁ దన్నుం జూచు ధేనువును గన్గొని మహీపాలుండురుకరుణారసంబుదోప మదేభవైరికిట్లనె. క్షాత్రమన క్షతమునుండి రక్షించుట. తద్విరుద్ధవృత్తిగలరాజు దోషప్రయుక్తములగు నసువుల మేనఁదాల్ప నేమి ప్రయోజనము. అంతియకాక యీ ధేనువు వెల్పుటావునకే విషయంబునను దీసిపోవునదికాదు. అది కారణంబుగ నే నెన్నికోట్ల గోవుల నొసంగినను మునికోపము చల్లార నేరదు. కావున నోమృగేంద్రా! దయాకలితచిత్తుండవై నాదేహంబు గొని నీక్షుద్బాధానివారణంబు గావించికొని దీని విడిచిపుచ్చిన

చో నమ్మహాత్ముని హోమాద్యనుష్ఠానక్రియలు నిర్విఘ్నంబుగా నెఱవేరు. నీవును స్వామికార్య తత్పరుఁడవే. నీకు దేవదారు వృక్షమునం దెంత యనురాగాతిశయమున్నదో యట్లే యవశ్య ముగ రక్షింపఁదగిన దీని నుపేక్షించి నాస్వామి యెదుట నే నెటు నిలుతును. కాన నాకు సద్యశస్సనెడి శాశ్వత శరీరం బు దయసేయుము. భూనాథుని కింకరుఁడవైన నీవు నా యాచన నిరాకరించుట పాడిగాదని ధర్మోపన్యాసంబు సేసె ను. అంతల కా మేకములయెకిరీటాధు వల్లెయని వేల్పుటా వును విడిచిపెట్టెను. పిమ్మట నా నృపకులతిలకుండు విల్ల మ్ములనటడించి స్థిరచిత్తంబునగుహాఁజొచ్చి మృత్యుదేవతవలె భయంకరాకారయై తనకెట్టెనుట నిలువంబడియున్న గుహ వర్తి సమీపించి తన మే నర్పణముఁ జేసికొనియె. అంత నా మనుజవల్లభుపై దివిజులు విరులువాన గురిపించిరి. అంత రాజు "ఓచిన్నవాఁడా లెమ్ము" అనెడి యమృతవాక్కు నాలిం చి లేచెను. నందినీధేనువు తల్లివలెఁ జెంగటనిల్చి క్షీరముల స్రవింపఁ జేయుచుండెను. హార్యత్నమదృశ్యమయ్యెను. ధేను వు "బిడ్డా! నీభక్తిశ్రద్ధలఁ బరీక్షింప నేనీమాయఁ గల్పించితి. నీవు సత్పురుషుఁడవు. శిష్టవర్తనుఁడగు వసిష్ఠు ప్రభావంబుచే నన్నా జముఁడుగూడ డాయనోడు. అట్టియెడ నీయల్పమృ గంబులొక లెక్కయా. నీ గురుభక్తికి నాశ్రితవత్సలత్వము నకును గడుముదం బొదవె. ఏదైన వరంబొండు వేఁడుము.

నేను కేవల దుగ్ధంబుల నొసఁగు గోవునుమాత్రమే కాదు. నేను సంతుష్టురాలనగుచో వేల్పులవలె నిఖిలాభీష్టంబుల ననుగ్రహింపఁగలనని నుడివె. అప్పుడు కోట్లకొలది యాచకుల సంతృప్తిఁబరచిన యా వితరణఖని, నిజబాహుబల సమగ్రితనెల్ల వైరవీరుల నురుమాడిన యాశూరశిఖామణి, కడు దీనునివలెఁ జేతులజోడించి "తల్లీ నాకు సుదక్షిణాదేవియందుఁ బ్రఖ్యాత యశస్కుఁడగు బుత్త్రుఁదయసేయుమని ప్రార్థించెను. అంతలకు నందినీధేనువట్ల యగుగాక యని యనుగ్రహించి తన క్షీరంబుల నొక దొన్నెలో నిడికొని త్రావుమనెను. అతఁడు వత్సంబునకును హోమాదిక్రియలకును నుపయోగింపగా మిగిలినవానిలో నాఱవభాగము గురునాన తిఁగ్రోల నిచ్ఛగింతునని న్యాయంబుగాఁదెల్పె. ధేను వత్యంతసంతుష్టాంతరంగయై నిరాయాసంబుగా నృపాలానుగమ్యమానయై మున్యాశ్రమంబున కేతెంచెను. పుడమిఱేఁడమితహర్షంబుతో గోవరప్రదానమును దొలుత గురునకు నటుపై నిల్లాలికిఁ దెలిపి వత్సమునకును హోమాదిక్రియలకును వినియోగింపఁగాఁ దక్కినవానిలో షష్టాంశము మునియనుమతిఁ గ్రోలె.

మరునాఁడుదయము గోసేవనమును భోజనమును ముగించి ప్రయాణమగు డామునిదంపతు లారాచదంపతుల నాశీర్వదించి కొంతమేర సాగించి వెనుక మరలిరి. జనవిభుఁ

డు సతీసమేతంబుగ నగరంబుఁ బ్రవేశింపఁ జిరకాల విశ్లేష భరపీడితులయిన పౌరులెల్ల రనిమేషులట్లు బహుకాలమా పుణ్యదంపతుల తెప్పవాల్పక చూచుచుండిరి. ప్రభువరేణ్యుఁ డెల్లప్రజల క్షేమమరసి మగిడి ప్రజాసమ్మతముగ రాజ్యపాలనమునకుఁ గడంగె. కొంతకాలమున కా ధరణీకాంతు కాంత గర్భంబుదాల్ప రత్ననిధి గర్భంబునఁదాల్చిన వసుంధరవోలె నాతఁడు తలచి సంతసించెను. ఒక శుభదినంబునఁ, బంచగ్రహము లస్తంగతులుగాక పరమోచ్చస్థితినుండఁ బ్రాచీదిశాంగనా గర్భంబున భానుమంతుం డుదయించు చందంబున సుదక్షిణాదేవి సుపుత్రునిం గనె.

ఈ కుమారోదయము సంతోషవార్త విన్పించిన యంతఃపురపరిచారికల కవనిపవుఁ డనేకభూషణాంబరములఁ గానుక గానొసఁగె. కమనీయవక్త్రరాకాసుధాకరుఁగాంచు క్షీరసాగరుమాడ్కి మారసదృశాకారుండగు రాకుమారుఁ గాంచి దిలీపుఁ డుప్పొంగుచుండె. మనీంద్రుఁడు రాపట్టికి వేదవిహితమైన జాతకర్మాది శుభకార్యంబుల శాస్త్రోక్తంబుగా నడపించె. శ్రోత్రానందకరములై మంగళవాద్యాది నృత్యగీతంబులును, విప్రాశీర్వచనంబులును వినువీధి నంటె. జనకుఁడు కుమారునకు శాస్త్రజ్ఞానమును, శత్రుజయమునుగల్గునని తెలిసి తదర్థసూచకంబుగ రఘువని నామకరణంబు సేసె. మనోజ్ఞములగు శరీరాంగకములతో నబ్బాలుఁడు

సూర్యకిరణములచే వృద్ధినొందు శుక్లపక్షసుధాంశురీతిఁ దలిదండ్రుల దృఢసంకల్పముచేతను వసిష్ఠు నాశీర్వచన మహిమచేతను దినదినప్రవర్ధమానుఁడగుచుండె. తొలుదొల్త నా బాలుఁడు దాదిచేఁ గరపఁబడిన జిలిబిలిపలుకులు వలుకుటయు, వ్రేళ్లుపట్టుకొని నడచుటయు లోనగు విషయముల నేర్చెను. అటుపిమ్మటఁ జూడాదికర్మ లాచరింపఁబడి చలించుచుండిన జునపములతో సమవయస్కులగు మంత్రికుమారులతోఁ గొలదికాలము విద్య నభ్యసించె. ఉపనయనానంతర ముపాధ్యాయులకడ నధికభక్తి శుశ్రూషనొనరించి చతుస్సముద్రములఁబోలు చతుర్విద్యల నచిరకాలములో నలవడఁ జేసికొనియె. సహజపరాక్రమోపేతుఁడైన జనకునొద్ద సమంత్రకములగు నాగ్నేయాద్యస్త్రవిద్యలనారితేరె. అటుపైఁ గొన్నివత్సరములకు రాజు యుక్తవయస్కుఁడగు సుతునకుఁ బాణిగ్రహణము గావించె. అంతఁ గొంతకాలమున కాతఁడు బహుకాల రాజ్యపాలనాభార వివర్జితుఁడై సుఖంబుండఁగోరి పుత్రు యౌవరాజ్య పట్టాభిషిక్తు నొనర్చె.

దిలీపుఁడు రాజపుత్రులే పరివారముగాఁగల రఘువు నశ్వమేధ క్రతూత్సర్జితములైన హయములకు సంరక్షకునిగ నియోగించి తొంబదితొమ్మిది క్రతువు లొనరించెను. తదుపరి నాతఁ డొనరించు నూఱవ యజ్ఞమునకు విఘ్నమాపాదింప నింద్రుఁడు మఖతురంగంబు నపహరించి యదృశ్యుం

డయ్యె. సపరివార సమేతుండగు రఘువున కశ్వవృత్తాంత మావంతయుఁ దెలియక విచారమగ్నుఁడై యుండ నచ్చోటికి నందినీధేను వరుదెంచె. అద్దాని ప్రభావంబుచే నాతని కదృశ్య వస్తువులుగూడ సద్భూతంబుగా లోచన గోచరముల య్యె. ఆఖండలుం డశ్వము నరదంబునకుఁ గట్టించికొనిపోవుట కాన్పించె. అంత రఘువు దేవేంద్రా! యాగభాగంబుల నాహరించు దేవతలలో నగ్రగణ్యుఁడవే. ఇట్టి నీవే నాజనకు జన్మంబున కడ్డాచరింపనేల తలకొనియెదవు. ఈయశ్వమేధంబునకు ముఖ్యసాధనంబైన దీని నింక విడువుమని సవినయంబుగ వేఁడుకొనె, అపుడా నిలింపపతి "కుమారా! నీవాడినది నిక్కువము. కాని యొకశ్రీమంతు లెవరేనిఁ దమకీర్తిధన మొరు లపహరించుచుండఁ జూచి యూరకుండఁగలరా. మీతండ్రి శతమఖుం డనెడు నా ప్రఖ్యాతి సమూలంబుగా నిర్మూలనం బొనరింప నీయజ్ఞము మొదలిడె. విష్ణువే పురుషోత్తముఁడనియుఁ బ్ర్యంబకుఁడే మహేశ్వరుఁడనియు శతక్రతుఁడే నేననియుఁ జెప్పుదురు. ఈ నామంబులు గ్రమంబుగా మా ముువ్వురికే కాక యొరులకుఁ జెల్లవు. కావుననే నీతండ్రి నూఱవ యజ్ఞపశువు నపహరించినాఁడ. ఇందులకు నన్నీవు ప్రతిఘటింపఁ బూనుకొనకుము. ఏలనవఁబోల్లి సగర కుమారు లరువదివేవురు యాగాశ్వమునకై కపిలు నలిగించి నాశన మొందినట్లు ఘటిల్లునని మందలించె. రఘువు దరహాసితాన

నుండై "నీవు తురంగమును విడుచుట లేదని త్రికరణశుద్ధిగా నిశ్చయించుకొంటి వేనిఁ దొలుత నన్నోడింపక నీయభిమతంబు నెఱవేఱఁజాలదు" అని నుడివె.

అంత రాచూలి శూలిపగిది ధనుర్బాణంబులఁ గేలఁ బూని సంస్థంభనరూపక శరమేదియు నిందుని తోఁబాటు చతురంగబలంబుల సంచారమును క్షణమాత్రమున స్థంభితంబయ్యె. ఇంద్రుఁడు కపలి భీకరరక్షోరుధిరపానోత్సుకంబగు మహేంద్రాస్త్రంబుఁ బ్రయోగింప నది రాకుమారు హృదయంబు వగిల్చి నూతోష్ణరుధిరపానం బించుక చేసె. అంత రఘువింద్రుని కేతనమును బడఁగొట్టె. ఇట్లు వారలిరువురు పరస్పర జయాభిలాషచే నొండొరులపై నాగాస్త్రంబులును, గారుడాస్త్రంబులును బ్రయోగించుకొనుచుండ నయ్యెడ నుభయసైన్యంబులకును ఘోరయుద్ధంబయ్యె. అంత పాకశాసనుఁడు రాపట్టిపై వజ్రాయుధంబు నేయ నవ్వీరుఁడు సైన్యబులు కలవిలఁ బడ నేల కొఱగి నిమిషకాలములో నత్యాశ్చర్యకరంబుగా మరల లేచెను. సైనికు లానందంబున జయధ్వానంబులఁ జేసిరి. అంత నాయుధవ్యాపారమున కజేయుఁడైన రఘువు నవలోకించి యింద్రుఁడు "బిడ్డా! నా కులిశంబు నోరువ నీకుంగాక యొరుల కసాధ్యంబు. నీయందు నాకు మిగులఁ బ్రీతివొడమె. ఈ నవనఘోటకము దక్క మఱిదేని నైనఁ గోరుకొనుము. అనవుడు స్వామీ! ఈమఖాశ్వము

నేరయఁగూడదని తోఁచినయెడల నా జనకునకుఁ గ్రతుఫలంబు సంపూర్ణంబుగా నిమ్ము. వెండియు నీ యుదంతంబు నీ చారులచే నా జనకున కెఱుక బరవుము" అని కోరెను. సంక్రందనుం డట్ల యగుఁగాక యని వెడలిపోయె. రఘువు వాజిని గోల్పోవుటచే విజయమును బాటింపక నిరుత్సాహంబుతో నగరి కేతెంచె. శచీవిభుం డట్లు భూవిభునకుఁ బరిచారికలచే సమాచారమంపించె. ఈప్సితార్థసిద్ధుండగు దిలీపుఁడు కుమారుని మేను నిమిరి యెంతయుఁగొనియాడి శ్వేతఛత్రమొసఁగి తాను సర్వసంగ పరిత్యాగియై వనముల కేగి యటఁ గొంత కాలంబునకు దేవత్వమొందె.

# మాంధాతృఁడు.

సీ॥ జననమాదిగఁ బాకశాసను కరమునఁ
బ్రభవించు నేయును బాలుఁడ్రావి
ద్వాదశదినము లాతఁడు గారవింపగ
వర్ధిల్లి పండ్రెండు వత్సరముల
ప్రాయమై రాజ్యసంప్రాప్తికి నేతెంచి
యర్కుని యుదయంబు నస్తమయము
నగుపట్ల పొలిమేరలయిన మహాక్షేత్ర
మంతయు నొక్కడ యనుభవించె
ఆ॥ వె॥ నన్నపర్వతముల నాజ్యనదుల విప్ర
భోజనములొనర్చి రాజసూయ
ములును నశ్వమేధములు జేసె మాంధాతృ
డితఁడు. ...................

యువనాశ్వుండను మేదినీకాంతుం డతుల యశో విశాలుండై సమస్త భూమండలంబు నేకాతపవారణంబుగ రక్షించి రాజ్య మేలుచుండెను. అతఁడు బలపరాక్రమోపార్జిత విజయలక్ష్మీసమేతుఁడు. మత్తవైరిశుండాలకుంభవిదళనోగ్రసింహుండు. అమాత్యులన్నో పరరాజ్యగ్రహణ

క్రియావిశేష నైపుణీశేముషులు. సైన్యంబులన్ననో భయం కరారివాహినీ నిర్మూలన దక్షంబులు. అశ్వంబులా పవమానవేగ తిరస్కృత జవసత్వసంపన్నంబులు. ఏనుంగులన్ననో నీలనీరదోపమంబులు. రథంబులు శతృమనోరథవిరథంబులు. ఇట్టి చతురంగ బలాన్వితుండగు నృపుం డన్వర్థాభిధేయం బగు నయోధ్యాపురంబు తనకు రాజధానిం జేసికొని యుడుగణంబుల పగిది విరాజిలు రత్నరాసులం గల్గి కాంచనసౌధగాడంబుల వాసము చేయుచుండెను. అంగడి రథ్యంబులు సర్వజన నిరంతర సంచారానుకూలంబులై సంతతరాజభట సంరక్షితంబై హాటామపదార్థంబులకు లోనుగాకుండు. నిరంతర పరమేశ్వర పాదారవింద భజనానందుఁడై సకలాభీష్టంబులందు నా రాజపుంగవుం డొకనాఁ డేలకో విచారసూచిత వదనారవిందుండై కనుపట్టుచుండె. ఆ భూకాంతుని వంత కావంతయుఁ గారణంబు కస్పట్టను. అయిన నొక్క విచారంబు హృదయశల్యమై వేధింపుచుండనోపు. పాప మాతేఁడు "మదైశ్వర్యలక్ష్మీకరసరోజాత మెవని కొసంగి విరమింతును. అది కారణంబుగ నయోధ్యా చక్రవర్తిననియైనఁ దలంపక నియమవ్రతులైన యతులు మద్గృహాంగణము సమీపింప నొల్లరుగద, నా మనస్సంతాపశల్యం బూడఁబెఱికి పుత్రభిక్ష నొసంగి నన్నుఁ గృతార్థునిఁ జేయువా రెవ్వరును లేరాయని యనుదినంబు సంతాపించుచుండె.

అంత నొక్కనాఁడు నిందుకొలువున్న మహర్షిపుంగవుల కడకు రాజేంద్రుఁ డేతేర నాతని యాగమన కారణం బెఱింగి ధర్మపరిపాలనాసక్తుఁడగు రాజట్లు సంతాపించుట లోకంబునకుఁ బీడనంబని యెంచి వాని కిట్లు బోధించిరి. "రాజా! నీ విప్పట్టున నైంద్రియాగం బొనర్చిన వంశవర్థనుండగు సుపుత్రుని బడయు నీవు వలయు సహాయంబెల్ల మే మొనర్తు" మని వచించిరి. అంత మేదినీకాంతుఁడు సంతోషతరంగి తాంతరంగుఁడై సత్వరము క్రతువొనరింతునని నిజపురంబున కేతెంచి నదీతటంబున విశాలయజ్ఞశాలాజాలంబులు నిర్మించి వలయు సంభారంబులెల్ల సమకూర్చె. తత్క్రియాప యుక్తంబులగు హోమకుండాదులఁ ద్రవ్వించి యాచుట్టును వలయు వివిధ వేదికల నమర్చియుంచె. వివిధ దేశంబులనుండి సామంతరాజు లెల్లరును తదితర వర్ణంబులవారును యాగంబునుఁ జూడ నపరిమితోత్సాహంబుతో వరుదెంచుచుండిరి. ఆ ప్రదేశమంతయు నేమూలఁ జూచిన నిముడ్చైచిన రాలకుండ జనసమూహములతోఁ గ్రిక్కిరిసి యుండెను.

ఒకనాఁటి ప్రాతఃకాలంబున నృపుఁడు మంగళస్నానమాచరించి యుదికిన మడుగుదోవతుల ధరించి యజ్ఞనిర్వాహకులగు నధ్వర్యులు, ఋత్విక్కులు నుభయపార్శ్వంబుల నడచిరాగ మంగళతూర్యారవంబులును, విప్రాశీర్వాదంబు

బును దానుముట్ల నిర్జరపరివేష్టితుండగు శతముఖు చందంబున గ్రతువాటికిఁ జొచ్చి శుభలగ్నంబున యాగ మారంభించె. ఆ భూపాలుఁ డతిశయ భక్తిశ్రద్ధాళుఁడై యింద్రప్రీత్యర్థ మా యజ్ఞంబు విధ్యుక్తంబుగా నాచరింపఁ బ్రీతుండైన యింద్రుని బంపున యజ్ఞేశ్వరుం డనుగ్రహించి విమలసలిల హేమపాత్రి వాని కిడి యంతర్హితుం డయ్యె. అంత నా భృగుమహర్షి పుత్రప్రాప్తికై పట్టమహిషి కీ పవిత్రోదకంబుల నీయను ద్దేశించి యవ్వారి ఘటం బతి భద్రంబుగా నొక నిగూఢస్థలంబున గుప్తపఱచియుంచెను. పాప మాతేని శా రేయి మిక్కుటంబగు దప్పి దోఁచెను. అట్లగుట నాతఁడు నీరంబులకై వెదకి కానక నిమంత్రిజలంబులని యెఱిఁగియు ననివార్య దాహపీడితుండగుట వానిం గడుపారఁ గ్రోలెఁ. అంత నాయధ్వర్యు లీయుదంత మంతరదృష్టి నెఱిఁగి "అయ్యొతూ! ఎంతటి కీడుమూడె. ఈ పవిత్రాంబువుల దేవేరికీయఁ దలంచి భద్రపఱుప మందభాగ్యుండగు రా జానీరంబులఁ ద్రావె. ఇద్దాన నెట్టి యాపద వాటిల్లునో కదా! దైవ నిర్ణయంబు దప్పింప నేరితరము" అని నివ్వెఱఁ జెందియుండిరి. వారట్లు విచారించుచుండఁ గొంతతడవున కా రాజు గర్భంబు వగిలి చక్రవర్తి లక్షణయుతుండగు బాలుఁ డుద్భవిల్లన ద్భుతంబున కాతఁడు మూర్ఛిల్లె. అత్తఱిఁ దల్లి లేమికతంన నాకటిపెల్లున శిశు వేడ్చుచుండ సంక్రందనుండు వత్స

రంబ జనుదెంచి క్షుద్బాధా నివారణార్థ మా బాలునినోటఁ దన దేశి నునిచి "బిడ్డా!-మాం-నన్ను-ధా-త్రావుము అని పలికిన నాతఁ డా దేశిని నోటఁ గుడిచికొనెను. ఇంద్రుఁ డంత వానికి మాంధాత యని నామకరణంబు సేసె. అంత నా బిడ్డఁడు నానాఁటి కభివృద్ధిఁ జెందుచుండె. ఆహా! భగవంతుని మహిమ లత్యద్భుతములుగదా! పరమేశ్వరు కరుణా కటాక్ష మీషణ్మాత్రము ప్రసరించిన యపారపారావారంబైన మహాంబుధి మోకాలిబంటియగు. భీకరాగ్ని జ్వాలా మాలికలు చందన సదృశంబులగు. కావుననే యువనాశ్వుండు దైవరక్షితుండగుట నుదరంబు వ్రచ్చియు మరణింపక సుతలాభ సౌఖ్య మనుభవించుచుండె.

ఆ బాలుం డీశ్వర వరప్రసాదుండగుట బాల్యంబుననే సకల కళాకోవిదుండై రాజ్యతంత్రంబు లెఱింగి యౌవనం బంకురింప జనకు సింహాసనం బధిష్ఠించె. తదుపరిఁ గొంత కాలంబున కా యువనాశ్వుండు సంసారంబు రోసి నిర్జనాటవికిఁ జని యధికభక్తి ననంతుఁగూర్చి తపంబాచరించి నశ్వర దేహంబు విడిచె. యౌవనాశ్వుండు పరాక్రమవిశేషంబున నల్లదీవుల కేలికలై ముష్కరులగు రక్కసుల నుక్కడంచి తన్నాయకుండగు దశగ్రీవు నాలంబున నోడించి నిష్కంటకంబుగ నిలఁ బాలించుచు సకల ధర్మస్వరూపుఁడును యజ్ఞేశ్వరుఁడునునగు పురుషోత్తముఁ గూర్చి యత్యంతభక్తి ననేక

యక్షంబుల నొనర్చి విప్రుల నిష్టమృష్టాన్నంబుల సంతుష్టులం జేసె. అతని నిర్వక్రవిక్రమపాటవంబును, ననుపమాన దైవభక్తియు దానరేఖావిలాసంబును హిమభాను కిరణము లెందనుక బ్రాకనందనుక వ్యాపింప నాయా దేశంబుల జను లాతని మహిమాతిశయము వేనోళ్ల వినుతింపుచుండిరి.

శశిబిందుం డను ఖ్యాతలేందునకు బిందుమతి యను పుత్రికారత్నంబుగలదు. ఆమె జగదేకమోహన మోహనా కారంబును, సకల కళాప్రౌఢిమయును, శస్త్రవిద్యాకౌశల మును, గురుదైవభక్తియునను సనలంకృత భూషణావళిచే విరాజిల్లుచుండెను. ఈ కన్యామణి జనకుం డా మహీపాలు సుగుణగణంబు లెఱింగినవాఁడౌటఁ దన కూతునిచ్చి కళ్యా ణం బొనరింప నా యుత్తమ దంపతులకుఁ గొలఁది వత్సరము లలో బురుకుత్సాంబరీషముచికుందు లను ముచ్వు రాత్మజు లను నేబదుగురు పుత్రికామణులును గలిగిరి.

ఒకనాఁ డా రాజమౌళి యమునానదీ తోయంబులఁ గ్రుంకులిడఁబోవ సౌభరియను వృద్ధతాపసి చనుదెంచి "వర నాథా! ఈ నదీజలంబుల నొక్కనాఁడు భార్యాపుత్రులం గూడి యానందించు నొక మీనరాజుం గాంచినంత నాకును దుర్వారంబైన సంసారకాంక్ష మదిఁ బొడమె. అట్లగుట నే నింకను స్త్రీవాంఛా విముక్తుండఁ గాఁజాలనైతి. కావున సౌం దర్యవతులగు నీ కుమార్తెలయం దొకరిని నాకిచ్చి మదభీష్ట

తం బొడగూర్చుమని యడిగె. అేఁ డెదురాడ నోడి యిక్క
న్యారత్నంబుల నీ వలచిన కన్యను జేకొనుఁడనె. అనవుడు
మునినాధుండు "కన్యామణులు, విద్యావయోరూపవిత్తంబు
ల నీడగువారి వరియింతురేకాని యొడల జిగిబిగియులేని నా
వంటి బడుగునెపసి నెట్లు వలతురు." అని వక్కాణించి మౌని
సత్తముఁడు నిజతపోమహాత్వంబున సర్వాభరణాలంకృత షో
డశవర్షప్రాయయౌవనుండై భూపాలు మోల నిలిచిన నతం
డాశ్చర్యచకితుండై వేత్రహస్తులతో నిముడ్రసిందుని నంతఃపు
రంబునకుఁ గొనిపొండన వారటులఁదోడ్కొ పోయి రాకన్నె
లకుం జూపిరి.

ఆ యువతీరత్నము లీ కోమలాంగ వినిర్జిత నవమన్మ
ధుఁగాంచి, ఇతఁడు వసంతుఁడో, జయంతుఁడో, కంతుఁడో,
యనంతుఁడో? మన పూర్వపుణ్యంబున లభించెనని తలంచి
వారలంద రాతనినే వరించిరి. జనవిభుండు వారల యభిమ
తంబు లెఱింగి సాలంకృత కన్యాదానంబులఁ జేసి మహావైభ
వంబుతో వివాహోత్సవంబు నడిపె.

తదనంతర మా సౌభరి రాజకన్యకల నందఱఁ జేకొని
నిజతపఃప్రభావంబున నిర్మితంబులైన కనకమణిమయ సౌధో
పరిభాగంబులం దొకప్పుడును, మహానీయ పర్యంకపీఠలీలా
శైలబిలంబులం దొక్కతఱిని, సారసచక్రవాకాది జలచర
నికాయ నివాసంబైన జలాశయంబులం దొక్కవేళను, శుక

శారికామయూరమధుకరనినాద ప్రతిబింబితంబైన రమణీయారామములం దొక్క సమయమునను లీలావినోదంబులం బొద్దుపుచ్చుచు, సకల సౌఖ్యపరంపరల కాలవాలుండై లీలతో ననుభవించుచుండె. అంత నా మునిపుంగవు మనోరథం బీడేరెనో యన వారికి విశ్రుతకీర్తులగు తనయులనేకు లుద్భవిల్లిరి.

పిమ్మట మాంధాతృఁడు రాజ్యభారంబుఁ బురుకుత్సు భుజాపీఠి నునిచి భార్యయుం దాను వానప్రస్థంబునఁ గాలంబుఁ గడుప నరణ్యంబునకుఁ జని యటఁ బెక్కేండ్లు తపం బొనర్చి పరాత్పరు దర్శించి ప్రియాన్వితంబుగ నుత్తమలోకంబున కరిగె.

# య యా తి.



మ॥ చతురంబోధిపరీత భూవలయమున్ సద్వీపసారణ్యస
క్షితిభృత్కంబగుదాని భూరిభుజశక్తిం జేసి పాలించుచున్
గ్రతువుల్ నూటొనరించికీర్తి వెలయంగాదిక్కులం దానిర్జితా
హితుఁడై యా నహుషాత్మజుం డడరె దేవేంద్ర ప్రభా
[ వంబునన్

త్రొల్లి శతాశ్వమేధంబులు సంప్రీతిఁగావించి శతమఖుం డను బ్రఖ్యాతివడసి దేవేంద్రపదవి నధిష్ఠించి మహోన్న తతేజంబున ముల్లోకంబుల నిరంకుశంబుగఁ బాలించిన నహుషుని పుత్త్రుఁడే యయాతి. ఇతఁడు సర్వధరామండలం బునకుఁ దానప్రభుఁడై ధర్మం బొకింతయుఁ గొఱఁతవడనీక పాలించుచుండెను. మేఘుఁడు సస్యానుకూలంబుగ వర్షింపఁ జొచ్చెను. ఇలాతలంబు సారవంతమై బహువిధ పుష్పఫల భరితంబులగు వివిధవృక్షజాతంబులతోడను, ధనధాన్యవస్తు నిచయంబులతోడను జూపఱకుఁ గనుపండువు సేయుచుండె. ఆ నృపాలపుంగవుం డసికుంతకార్ముకాద్యాయుధ పరిశ్ర ముఁడును, గజతురగారోహణ కౌతూహలాయత్తచిత్తుఁడును సుమారశక్తియుతుఁడును, నివృత్తవిరోధిసమాజుఁడునై, యభిమత కార్యకరణంబున బాంధవులకును, ననుకూలత్వంబున సుహృజ్జనులకును, బరిశ్రమ జ్ఞానంబున విద్వాంసులకును, గారుణ్యంబున ననాథలకును సంతసంబు నింపుచు రాజ్యం బేలుచుండె.

ఒకదినంబున రజనీచరాధినాథుండైన వృషపర్వు నునుంగు కూతురు శర్మిష్ఠ దన నెచ్చెలి దేవయానితోఁగూడి సహస్రపరిచారికా నివహంబుతో నొక శృంగారాభిరామం బగు నారామంబుఁజొచ్చి యందలి సుగంధకుసుమఫలభరిత మందర తరుబృందంబుల నీక్షించుచుఁ గీరశారికాదుల య

స్పష్టమధురమంజు లాలాపంబు లాలించుచుఁ బోవంబోవ

చ॥ జలజముఖుల్గనుంగొని రజస్ఫ్రివికస్వరపుండరీక కు
ట్మల వివరాంతరస్ఖలదమందమరంద పరాగమండలో
పలఘనసాంద్ర చంద్రికిత పాండురితాంబుతరంగ ఖేలనా
హాలహాలికావిలోల కలహంసము చారుసరోవతంసమున్

అంత వార లత్యంతానందంబున జలక్రీడాసక్తచిత్తులై జలాశయంబునందు డిగిరి. అందు ముందు కొందఱు సుందరులు సొచ్చి యందలి జలంబు పదప్రమాణంబు, మోఁకాలిబంటి, కటిద్వయసమంబు, కుత్తుకమాత్రంబు" అని పల్కుచుఁ దోడివారలఁ బిల్చి కొంచు కరంబున నీరెగయఁ జిమ్ముచు, నెదుర్కొను తరంగంబుల కుల్కుచు, సారసమరాళంబులఁ జోపుచుఁ దమ్మిల కమ్మదనంబునకు మూఁగి జుమ్మను తేంట్లఁ వెఱచుచు సరససంభాషణంబుల నెఱపుకొంచు, నంజలి పుటంబుల నీరువట్టి యొండొరులపైఁ జల్లుకొనుచుఁ జల్లునెపలఁ దడబడఁ దాటుచు, దాఁటిచననీక నిలువరించుచు, నిలుపరించి వినోదించుచుఁ బెద్దయుం బ్రొద్దు తద్దయు నోలలాడిరి.

అత్తఱి నామార్గంబునఁ బల్లవారుణ జటాజూటంబునఁ బరమ పావనియగు నాకాశ గంగయు నమృతాంశురేఖయుఁ జెలంగ గళంబున సముజ్జ్వభూషణ మన దుర్ధర హాలాహాలంబు మెఱయఁ గటితటంబున గజచర్మాంబరంబు వింత

మురువుసూప దేహంబున భసితాంగరాగ విభ్రమంబు విద్యు త్ప్రభలసీన, త్రిశూలపాణియగుశూలి కొండచూలితోఁ జనుచుండఁ గాంచి తత్తరంబున నా బిత్తరులు జలాశయంబు వెలువడి కలవిలపాటుతోఁ గట్టున విడిచిన తమ యుడుపుల ధరింపఁ జొచ్చిరి. శర్మిష్ఠ యా సంరంభమునఁ బ్రమాద వశంబున దేవయాని మవ్వలువ మేనఁదాల్చుట తటస్థించె. అదిగని దైత్యరాడ్గురు పుత్రియగు దేవయాని రోషచకితయై శర్మిష్ఠపై రూక్షేక్షణంబులఁ బ్రసరింపఁజేసి “గోపాచరాధిపు నయానను గర్వంబున జాతినీతులఁ దలంపక జంకుగొంకులవీడి నా వసనంబు నెటుల ధరించితివి. భృగువంశ మతిపవిత్రంబని యెఱుఁగవే. అందు సుప్రసిద్ధచరిత్రుం డైనశుక్రు తనూజాత నగు నా పటంబు నీ వెటులఁ గట్ట సాహసించితివి. శ్వానంబు పసిండి గొలుసులచేఁ బలువిధంబులఁ గై సేయఁబడినను హవిర్భాగంబులఁ గొననర్హముగానట్లు మహామహిమాన్వితల పుట్టంబుల క్షుద్రకాంతల కెట్ల కట్ట సమకట్టునగు” నని యాడుసింగంబు మాడ్కి గర్జింపు డా దానవరాజ సుత తాలిమి దూలియు సహజసరళస్వభావ యగుటచే మారువలుక నోడి నిజావాసంబున కరిగె. అప్పుడాపె చెలికత్తె మోర్తు నాసాపుటంబుల వేడినిట్టూర్పులు సెలంగ నక్షులగ్నికణంబులురల” కూలికివచ్చి పాలికి మాటలాడెనను చందంబునఁ గుక్షింభరుఁడై వచ్చిన నీ తండ్రికి గ్రాసవాసం

బులఁ గల్పించి పోషించుచున్నందుల కా విశ్వాసంబుఁ దెగడి రాట్పుత్రికకంటె నధికురాలనని ప్రేలుచుంటివా? యని క్రించుఁదనంబు దోఁపఁబల్కి నెచ్చెలులతో "ఈ నీచురాలి కాలుసేతు లంటఁగట్టి యల్లదే యా పాడునూతఁ గూలఁద్రోయుఁడి"న వా రదయులై శుక్రాత్మజ కరచరణంబుల బంధించి యంధకార బంధురంబైన యా యగాధ కూపంబునఁ బడఁద్రోసి చనిరి.

అంత నా దేవయాని దిక్కులేని పక్కివలె స్వప్రాణ రక్షణోపాయంబుఁగానక వివిధగతుల విలపించుచుండ నంతఁ గొంత తడవున కవ్వనంబునకు మృగయావినోదార్థ మరిగి మరలివచ్చు యయాతి భూపాలుఁ డాయార్తనాద మాలించి యొక్కపర్వున డాయంజని నూతనున్న యావనితం గాంచి చేయూఁతనిచ్చి

శా॥ సప్తాంభోనిధి మేఖలావృత మహాసర్వంసహా కన్యకా
పాణిప్రోద్యద్వరదక్ష దక్షిణకర ప్రాలంబముం జేసి ప్రో
క్షిప్తంజేసె యయాతి గట్టుకొన పైచేలంబు మున్నిచ్చిప
ర్యాప్త స్వేదజలాంగి వారిసముదాయాలంకృతన్ భార్గ
[విన్॥

నూయి వెలువరించిన యా ప్రాణదాత వృత్తాంత మాతనివలన నామూలాగ్రముగఁ దెలిసికొని నిండుకుతుకంబును గృతజ్ఞతయుఁ దేటఁబడ నా రాజవదన "ఓ మేదినీరమ

ణా ! నీవు నా పాణిగ్రహణం బొనర్చు కతంబున మన్మనో
రమణుండ వైతివి. నా జన్మము సఫలమయ్యె. మున్నొకప్డు
డొక మునిపుంగవుండు మా యాశ్రమమునకు రా నా జన
కుండు శుక్రుఁడు వాని సపర్యలకై నన్ను నియోగించె. నే
నతిశయభక్తియుక్తి నమ్మహాత్మునకుఁ బుష్పఫలంబులఁదెచ్చి
యిచ్చుచుఁ బరిచర్యల సలుపుచుండ నాతం డమిత ప్రీతి
ననుఁ జేరం జీరి "బిడ్డా ! దేవయానీ! నీవు మహారాణి వగు
దువుసుమా" యని జ్యోతిషంబు సెప్పె. పెద్దల వాక్యము
రిత్తవోవునా? మదీయ పూర్వకృత పుణ్యవిశేషంబున భూభ
ర్తవైన నిన్ను భర్తగాఁ బడయఁ గల్గితి" నని చిఱునగవొల
యఁ బలికె. అంత నా భూకాంతుండు "ఓ కాంతా ! బ్రా
హ్మణులు క్షత్రియకన్యల నుద్వాహం బయ్యెదరే, కాని
బాహుజు లెచటనైన బ్రాహ్మణకన్యలఁ బెండ్లియాడుదురే.
నీ పలుకులు ధర్మవిరుద్ధములుగ నున్నవి. వెండియు వర్ణా
శ్రమ ధర్మంబులఁ బాటింపవలసిన నే నిట్టి యకార్యా
కరణంబునకుఁ గడంగఁజాల"నన భార్గవి "రాజా! అంతియ
కాదు. తొల్లి త్రిదశాచార్య పుత్రుండగు కచుండు నా
జనకు ననుగ్రహంబు వడసి మృతసంజీవనీవిద్య నభ్యసింపు
చుండ నా మనం బాతనియందు నిమగ్నమయ్యె. అతండు
వావివరుసలఁ బాటించి గురుపుత్రినగుట నన్నొల్లమి నే వాని
పై నలిగి నీకీవిద్య విఫలంబగు గాతమని శపించితిని. అద్దాన

సతంబును గుపితుండై నీకు విజాతిపురుషుండు భర్తయగు బొమ్మని ప్రతిశాపంబిచ్చె. ఆ కారణంబున బ్రాహ్మణుండు నాకు భర్తగాఁబోఁడు. నీవే నా మనఃప్రియుండవు. అని దైన్యంబు దోఁపఁ బలుక యా మహీపాలు స్వాంతం బా నెలంతపైఁ గఁదురుకొనఁట చూచి యుత్తమక్షత్రియులును ధీరోదాత్తులును నగు నీ భవ్య శశాంక వంశంబున జనించిన నాఁడెందఁబు విప్రకన్యలపై కెన్నఁడునుబోదే! ఈశ్వరాజ్ఞ మవిలంఘనీయము. కానిచో నిట్లెన్నడును జరుగనేరదు. అదియుంగాక యుత్తమపురుషులకుఁ దమ మనోభావమే భావ్యాభావ్య నిర్ణయ ప్రమాణమని తలంచి భార్గవిని భార్యగా నంగీకరించి తాను నిజరాజ్యంబున కరిగె.

తదనంతర మా దేవయాని దుస్సహాపరాభవదావానల దందహ్యమాన మానసమానసయయి జనకునకుఁ దన పరాభవంబు విన్నవించి కన్నీరు మున్నీరుఁ జేయుచు "సహస్రపరిచారికా సమేతంబుగ శర్మిష్ఠను నాకు దాసిగా జేయఁటొండె. ప్రాణత్యాగ మొండె. వేరొంట నామనంబు పదిలపడదని పలుక శుక్రుండదరిపడి కూఁతుతో దైత్యలోకనాయకుని గొలువుఁజొచ్చి సరోషభీషణుండయి "నీ తనూజ రాజ్య మదాంధత్వంబున నొడలు మఱచి నా ముద్దుకూతు నర్నిమిత్తంబుగ నూతఁ దోయించె. ఇంక నీ పీట నిముస

మైన నేనుండఁజాల" నని దుహితం దోడ్కొని తరల ను ద్యుక్తుండైన దైత్యవల్లభుం డంతయుఁ దెలిసికొని యాతని సాయంబున వైరి విజయం బాకాంక్షించుటం జేసి తెరువున కడ్డంబు దగిలి పదంబులఁబడి "ఓ పరమగురూ! జ్ఞానహీన యగు నా కూఁతు దోషంబు మన్నించి నన్ననుగ్రహింపు" మని ప్రార్థింప నా భూసురుండు "రాజా! ఈ తప్పు సైరింపఁ దగినదికాదు. ఐనను నీ కుమార్తె శర్మిష్ఠ సహస్రపరిచారికా యుతంబుగ నాకూఁతుఁ గొలువఁ బంపెదేని నా కోపం బుప శమిల్లు" ననె. అసురభర్త యంత కింకర్తవ్యతామూఢుఁడై యొకింత తడ వూరకుండి పిదప వేవురు చెలులతో శర్మిష్ఠను దేవయానిని సేవింపఁ బంప శర్మిష్ఠయు

మ॥ చలమింకేలని తన్ను తండ్రి పనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలుసహస్రంబున్నజస్రంబు ద
న్మ్రోలఁగన్ దాసియుదాసియయ్యెవివిధామేయోగ్రకోపా
[ నలా
కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమ స్థానికిన్॥

అంతఁ గొన్నాళ్లకు దనుజగురుండు సితఖ్యాతియు సా ధువినీతియునగు నహుష్యయాతిమహారాజును రావించి తనూ జాత నిచ్చి మహావిభవంబునఁ బాణిగ్రహణం బొనరించె. ఆ ధరణీరమణుండు శర్మిష్ఠాది సహస్రపరిచారికా సమేత యగు దేవయానితోఁ దన ప్రథానపురంబున కేగె. ఆ దంప

తుల కిర్వురకు యదు తుర్వసులను నిర్వురు కుమారు లుద
యించిరి.

పిమ్మట నొకనాఁటి రేయి శర్మిష్ఠ యదు నెఱింగి యా
తని పాలికిఁ బోయి స్వవృత్తాంతంబు సాకల్యంబుగ విన్నవించి
తన్నుం జేకొనుమని వేఁడుకొనె. రాజు శర్మిష్ఠ నిర్దోషత్వం
బును, సంప్రాప్తయౌవనంబును, దేవయానితోఁ బాటు పరి
చారికయుఁ దదర్థంబగుట గ్రహింపవచ్చునను ధర్మసూక్ష్మం
బును గ్రహించి యామె మనోరథం బీడేర్చె. మనుజ
వల్లభుం డట్లు దనుజరాజపుత్రింగూడి చరింపుచుండఁ
గాలక్రమంబున వారలకొక శుభదినంబున ద్రుహ్యాను
పూరులను ముగ్వురు పుత్రు లావిర్భవించిరి. దేవయాని
పతి తన ధామంబునకుఁగొలదికాలంబునుండి రాక తమ్మల
యింపఁ గారణం బేమొకో యని వితర్కించుచున్నతఱి య
దుం డరుదెంచి రహస్యంబు వెల్లడించె. అంత నామె హృద
యంబునఁ గ్రోధాగ్ని ప్రజ్వరిల్ల నా యువతి పితృమందిరంబు
న కేగి జనకుని పదంబులఁబడి దురపిల్ల నాతం డెల్ల విషయం
బుల నంతరంగంబునఁ దెలిసికొని భయంకర శాపంబు నిడఁ
దలంచుచుండె. యదువు వలన నీ సమాచారం బెఱింగిన
వాఁడై యయాతి, శాపభయపీడితుఁడై యొక్క పర్యాన నూ
చపగిది వచ్చి "మామా! నా ప్రథమదోషము నున్నింపుము
ఇంక నీ కూఁతుఁ బ్రీతిఁజూతు"నని ప్రార్థించె. అంత శుక్రుం

డు యయాతిం గాంచి "ఓయీ! నా యనుఁగు కూఁతు నొక మూలఁ గూలఁదోసి దైత్యరాట్తనయతో నిరంతర సుఖంబులఁ దేలుచుంటివిగా! కావున దురంతదుస్సహజరాభారంబు నిన్నొందెడు మని శపియించె. అంత

కం॥ తల వడఁక దొడఁగె నింద్రియ
ములు గర్వమడంగె నంగములు వదలె వళీ
పలితంబులయ్యె వగరును
దలయేరును నుక్కసయును దలకొనుదెంచెన్"

ఇట్లు జరాక్రాంతుండైన భూకాంతుండు "అనఘా నా యజ్ఞానకృత దోషంబు సైరింపవలయు. ఇంకను దేవయాని యందలి యనురాగంబు నను వీడలేదు. ఇప్పుడీవృద్ధత్వంబు దాల్పఁజాల.ననుఁగరుణించి శాపవిమోచనంబుఁ జేయవలయునని మొఱవెట్ట దేవయాని మగని వికృతాకృతియుఁ దనయందలి వాంఛయును దలంచి సదయయై తన భర్తచేసిన యపరాధంబు మన్నింపవలయునని నిజజనకునిఁ బ్రార్థించె. మునియు సకరుణుండయి "ఓ యయాతీ! నీ ముదిమి నీ కుమారులం దొక్కని కిచ్చి వాని జవ్వనంబుగొని రాజ్యభోగంబుల ననుభవింపుము. ఐహికవాంఛల నీ కెన్నండు విసుగుజనించు నాఁడు నీముదిమిగొని వాని తారుణ్యంబు వాని కిచ్చునది. ఎవ్వండు నీ వృద్ధాప్యంబు దాల్చు వాఁడ రాజ్యార్హుండును వంశవర్ధనుండును నగు" నని

తెల్పిన సంప్రమోదితచిత్తుఁడై దేవయానితోడం గూడి యయాతి స్వపురంబునకేతెంచి యగ్రసుతు యదువుం గని శాపవృత్తాంతం బెఱుక పఱచి తన జరం గొని వాని తారుణ్యం బిమ్మనిన నాతండు

శా॥ శాంతాహేయము దుర్వికారము దురా కండూతి వి
[శీర్ణంబు హృ
చ్చింతామూలము పీనసజ్వరము ప్రస్వేద వ్రణాకంపన
శ్రాంతిస్ఫోటకయుక్తమీ ముదిమి వాంఛన్ దాల్చి నానా
[సుఖో
పాత్తంబైన వయోనిధానమిది యయ్యా ప్రాయమీ
[వచ్చునే"

అనియెను. అటుపిమ్మటఁ దుర్వాదుల కెఱిఁగింప వారును నగ్రజుతోఁ బాటు నొడఁబడరైరి. తుట్టతుదకుఁ గడగొట్టువాఁడగు పూరునిఁ జూచి "నాయనా! జనకునకనుకూల ప్రవర్తకుఁడే పుత్రుఁడు. నీవు జనకు నానతి నెన్నండును జవదాటి యెఱుంగవు. నీ యన్నలతెన్నున నన్న వమానింపక నా జరాభారంబుఁ గొని నీజవ్వనంపుఁ గలిమి నాకిమ్ము" అనినంతన గురుభక్తిగుణాధారుండగు పూరుండు వినయ వినమిత శిరస్కుండై నుదుట కేల్దోయిఁ గీలించి యింతమాత్రపుఁ బనికి నన్నింతగాఁ బ్రార్థింపవలయునే.

"క॥ మునివృత్తి దయ్యనేటికి
జనపాలక సుగతిగోరు సత్పురుషులకున్
దనుగన్న తండ్రిసెప్పిన
పనిఁజేసిన సుగతి గాంగు పసిఁడియగాదే"

ఇదె నాయౌవనంబు గైకొమ్ము. నీ వార్ధక్యము నా కిమ్మని కోరి వాని ముదిమి నమ్ముదంబునఁ గొని తన జవ్వనంబు తండ్రి కొసంగె.

తదనంతర మా యయాతి యనేక వత్సరము లవని నిష్కంటకంబుగఁ బాలింపుచు సుఖోపభోగంబులఁ దనివితీర ననుభవించి కృతాధ్వరకతుండై దిగంతవిశ్రాంత యశశ్చంద్రికల నెల్లెడల వ్యాపింపఁజేసె. కొన్నాళ్ళ కతఁడు రాజ్య విముఖుండై, యెల్లసుఖంబులు హేయంబులని రోసి, సుగుణ గణాలంకారుఁడైన పూరు జవ్వనంబు వాని కిచ్చి జరా భారంబు తాన దాల్చి సకలభూవలయంబునకుఁ గుమారు పూరు నభిషిక్తుఁ గావించె. మెండియు నతఁడు యదుప్రభృతులఁ బ్రత్యంత భూములకు రాజులంజేసి వైరాగ్యంబు పెంపున నీశ్వరు నేకాంతభక్తిం గొల్చి జ్ఞానమార్గంబున ముక్తి కాంతాకర గ్రహణంబు సేసె.

# అంబరీషుఁడు.

శా॥ సప్తద్వీప విశాలభూభరము దోస్తంభంబునందుంచి సం
ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవ సంపచ్చాతురిం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలము న్బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్"

కృతయుగంబునఁ బ్రతిష్ఠానపురమును బ్రధానముగఁ జేసికొని యంబరీషుఁడను చక్రవర్తి సప్తద్వీపంబుల నేకఛత్రాధిపత్యంబుగ నిర్వక్రవిక్రమంబున రాజ్యపాలనం బొనరించుచుండె. అతఁడు సత్యవ్రతాచరణుండును, సర్వభూతదయాపరుండును, సకలశాస్త్రార్థకోవిదుండును, సర్వశాత్రవకుల భయంకరుండును, గోబ్రాహ్మణ దైవభక్తియుతుండును దుష్టశిక్షణ శిష్టరక్షణదక్షుండునునై యొప్పుచుండె. వెండియు నతండు భూభాగ్యంబు లస్థిరంబని తలపోసి హరిపదచింతాసక్తుండై సర్వజగంబును శ్రీహరిమయంబనియు నాతనికంటె వేఱొండు దైవంబు లేఁడనియు నతనిఁ దెలిసి మనుటయే జన్మకు సార్థకంబనియు, నాహారవిహారవ్యవహారంబుల నాతని నామస్మరణామృతపానముఁ జేయుచు నా సర్వేశ్వరు

నాత్మఁజూచుచు, సేవింపుచు నఖిలంబు మఱచియు మఱువక సంసారముఁ గర్దమమ్మనాళవృత్తిఁ గడపుచుండె.

ఆపురుషవరేణ్యుఁడు మహామహిమాంచితులగు మహర్షులఁ జెంతనిడుకొని వారలయనుమతి సరస్వతీ తటంబున ననేకాధ్వరంబుల విష్ణుప్రీతికరంబుగ నాచరించి యద్వితీయవిష్ణుభక్తుండై చిరయశం బార్జించి వినుతికెక్కె. కతిపయదివసంబుల కాతని కైహికభోగంబుల విరక్తి జనించె. ఇంత వఱకుఁ బ్రీతిజనకంబులై భార్యాపుత్రమిత్రబాంధవాళియు, ధనకనకవస్తువాహన సంపత్తియు నిపుడంతగా వానికి రుచింపవయ్యె. ఇప్పుడా రాచతపసి యేకాంతంబున విపులభక్తిమనఃపద్మంబుల హరిపదపద్మ ములఁ బూజింపుచు సంసారపామరత్వంబు గ్రమక్రమంబుగ విడనాడుచుండె. ఎట్టి మధురపదార్థంబులనైన దినగఁ దినఁగఁ గాలగతి నరుచి పుట్టకమానదుకదా!

అంత నొకనాఁ డాతఁడు గృహంబువీడి యొటకేనిఁ జని యేకాంతంబున నీశు భజింప నాసవొడమి తన భార్యకుం దెలుప నాపెయు భర్తృసేవాపరతంత్రయై నాథునితోఁ గూడి రా సమకట్టెయు, నాత నా పుణ్యదంపతు లిరువు రొక శుభదినంబున విప్రోత్తములరావించి శాస్త్రోక్తంబుగఁ బుత్రుఁడగు విరూపునకుఁ బట్టంబుఁగట్టి " తండ్రీ! ప్రజలఁ గన్నబిడ్డల మాడ్కిఁ జూచుచు ధర్మంబు దప్పక ధరణి నేలు

మని బుద్ధులఁ గఱపి వానప్రస్థంబునఁ గాలంబు గడుపనెంచి యొక కాంతారంబు సొచ్చిరి. అచట వారొక పర్ణశాల నిర్మించుకొని మహామునులచే వేదవేదాంగ పురాణేతిహాస యుపనిషదర్థంబులవినుచు నొకనాఁడు "అనఘులారా! వ్రతం బులన్నిట నుత్తమోత్తమంబైన వ్రతం బెయ్యది సెలవిండ" న వారలా రాజర్షితో విష్ణుప్రీతికరంబును సర్వాభీష్టదాయ కంబును, బాపాటవీదవానలంబును నిఖిల జనానుష్ఠేయంబు నునై యలరారు ద్వాదశీవ్రతం బొంకు గలదని తెల్పిరి ఆ నృపసత్తముం డద్దాని నొక వత్సరం బతిశయభక్తి నాచ రించి వ్రతాంతంబగు కార్తీకమాసాంతంబున త్రిరాత్రోప వాసంబు సలిపి కాళిందీజలంబులఁగృతస్నాతుఁడై మధువనం బున మహాభిషేకవిధానంబున నచ్యుతు నభిషేకించి యో గ్యంబులగు గంధాక్షతల నర్పించి సుగంధకుసుమంబులఁ బూజించి తదనంతరంబు జందెగట్టుల ననేకవేల సవత్సగో దానంబుల భూరిదక్షిణలతోడ నొసంగె. పిమ్మట నాపుడమి ఱేఁడు భూసురుల కిష్టాన్నంబుల నిడఁదలంచి ద్వాదశిదినం బున నద్భుత ప్రయత్నంబులఁ జేయించె. భూసురులెల్ల గాహారింప నాసీనులైయున్నతతి సకల తాపసలోక భయం కరుఁడును, బ్రభాకరప్రతిమాన తేజోవిరాజితుఁడును, నిరం తర యోగాభ్యాస నిష్ఠాగరిష్ఠుఁడును నగు దుర్వాసమునీం ద్రుఁ డట కేతెంచి "ఓ రాజా! నీ దాతృత్వము సకలాశాం

తంబులనిండి వెలుఁగొందుచుండె. నే నేకాదశి నుపవసించి యాఁకలిబాధ కోపలే కల్లాడుచుంటి” నను తత్క్షణంబే, మహాత్మా! మహాప్రసాదము. భగవదాగమంబున నా జన్మంబు తరించె. నా తపంబు పండె. దయసేయుండ” ని యుచితాసనం బిడి యర్ఘ్యపాద్యాదులఁ బూజించె. అంత దూర్వాసుం “డిదె నే బోయి స్నానమాడి వచ్చెద” నని యచ్చోటు వాసె. జనవిభుండు “నేఁడుగదా సుదినము. నా యదృష్టవిశేషంబున నిమ్మహాత్ముఁ డిట కరుదెంచె” నని మనంబునఁ బొంగుచుండె. బ్రాహ్మణులు భోజనములఁ జేయక శాంతముతో నెంతసేపో వేచియుండిరి. కాని మునివచ్చు జాడయే కాన్పింపదు. రాజు తటాలున లేచి కటితటంబునకుఁ బటంబుఁ జుట్టి నిటలంబున కేల్గవ మొగిడ్చి “ధరణిసురలారా! మునిచంద్రుఁడు జలంబులఁగ్రుంకు లిడఁజని యిందనుక రాఁడయ్యె. ద్వాదశిగడియలా దాఁటుచున్నవి. పారణసేసిన నా పాఱుఁడు కోపించి శపించు. అటులఁ జేయకుందునా వ్రతఫలంబు వమ్మగు. ముందు నూయి వెనుక గోయియనునటుల ద్వంద్వసంకటంబు దాపరించె. మీరు ధర్మాధర్మవిచక్షణ దక్షులరు. ఇప్పట్టునఁ గర్తవ్యం బెద్దియో యానతిండ”ని ప్రార్థించె. అంత వారలు సకలశాస్త్రంబులఁ బరిశోధించి “భూపవర్యా! వెఱ్ఱిబాపఁడు నీటిలో మునిఁగి రాక నిన్ను మోసగించె.

"ఆ! ఆ! అతిథివోయి రామి నధిప యీ ద్వాదశి
పారణంబు మాన పాడిగాదు
కుడువకుంటగాదు గుడుచుటయునుగాదు
సలిల భక్షణంబు సమ్మతంబు."

అద్దాన నీ వ్రతంబు చెడదు. వెండియు నతిథి తిర స్కారంబును గానేరదు" అన రాజేంద్రుం డిష్టకామ్యార్థ సిద్ధికై జలపానంబు సేసె. విప్రులుగూడ సుఖపారణ సేయ మొదలిడిరి. జననాథుండు మాత్రము మునినాథుని రాక కెదురుచూచుచుండె. మార్వాసుం డియ్యాది మనంబున నెఱింగి సత్వరంబ చనుదెంచె. జనపతి "మహాత్మా! అను గ్రహించి యశనంబు నాహరింపుఁ డ"న క్రోధవిస్ఫారితా త్ము లగ్నికణంబులుమియ, భ్రుకుటీతటం బల్లాడ నాసా గ్రపుటంబు లదర నాకలి రెట్టించి కొట్టుమిట్టాడ "ఓరోరి నృపకులపాంసనా! తుచ్ఛమతీ! నా కాతిథ్య మిచ్చి నా కంటె ముందుగా భుజించి మావంటి మహర్షులఁ గొంచపర తువుగా. ఓరీ! భాగవతాపరాధీ! నీ విట్లొనరింతువని నే నెన్నఁడును దలంచనైతి. చూచితిరా! వీని యైశ్వర్య మ దాంధత్వము. వీఁడట విష్ణుభక్తుఁడట. మావంటి పెద్దల నవమానింతువుగా. నీకు గాలంబు సమీపించె. కానిచో నిట్టి యకృత్యం బొనరించి నా యాగ్రహమునకు గుఱికావు నీ మనంబున నన్నెవనిగాఁ దలంచితివో, నేనే నిక్కముగ

నలిగినచో నీ త్రిభువనంబుల నిన్నుఁ గాచువారెవ్వరు. ఇదె మదీయ తీవ్ర కోపానలంబున కింధనం బయ్యెదవు చూడు" మని పటపట పండ్లుకొఱుకుచు నట్టహాసంబు సేసి హుంకరించి శిరంబుననుండి జట నొకదాని సమూలంబుగ నూడఁ బెఱికి "ఇయ్యది ప్రళయకాల కాలునిపోల్కి నిన్ను హరించు గాత" మని నేలఁ బడవైచె.

అద్దానినుండి జనించి భూమ్యాకాశంబులఁ గప్పి నీల మేఘంబుల నిరసించు దీర్ఘదేహంబుతో, నక్షియుగంబున రాలు కాలానల సన్నిభంబులైన యగ్నికణంబులతోఁ ద్రిభువన కబళనోత్సాహసూచకఘనవదనగహ్వరంబుతోఁ గ్రకచపత్రప్రతిమాన నిశితకర్కశకరాళదంష్ట్రాళితోఁ నేల బదంబులును నింగి శిరంబును గల్గి హుమ్మని హుంకరించుచుఁ దనుఁ మ్రింగఁ జూచు భయంకరమూర్తియగు కృత్తిఁజూచి శీతజ్వరపీడితునిపోల్కి వడవడ వడంకుచు నెద్దియుఁ బాలు వోవని మనంబుతో "శ్రీహరీ! నీవు నన్నేమి చేసినను జింత నొందఁగాని యీ విప్రు లిపుడే పారణంబు సేయు మనిరి. వారలు నా కిపు డొదవిన యాపదఁ జూచి యన్యాయంబుగ నశనంబుల విడిచెదరు. ఈ మహాపరాధంబున కాస్పదుండ నే నగుదు. ఓ దీనశరణ్యా! ఈ పారు లారగించు నంతవఱకైన నీకృత్తి నాపుము. అటుపైన నే నేమయి ననుమ రే చింతింప" నని పలుకుచుండగఁ బార్థివ దీనజన

రక్షాదక్షుండును భక్తవత్సలుండును నగు నాహరి తన భక్తుని మొఱాలించి వేగమే సుదర్శనంబును రావించి మునియుగ్రప్పు మోటుదనంబు మాన్పించుటకును దత్కల్పిత దుష్టకృత్తికా సంహారణంబు గావించుటకును నియోగించి "ఓ చక్రమా! ఈ వెఱ్ఱితాపసి వేడబం బడగింపుమా" యని భూమికిం బనిచె. అది భయంకర మారణయంత్రంబో యన భూమి కవతరించి యొకతృటిలోఁ గృత్తి నెత్తిమొత్తె. అంతటఁ దనివిసనక దూర్వాసు వెన్నంటి మంటగొల్పి తఱుముచుండె. పాపము దుర్వాసుఁడు ముందు చక్రము వెఱుంద నురగంబు సొచ్చు సారంగంబులోనికి దావానలంబు చొరుచందంబున జక్రజ్వాల లాతని వెన్నాడ నెప్పలేక మేరుగిరి గహ్వరంబుఁ జొఱఁ బోవుచున్నాఁడు.

మ॥ భువిదూఱన్ భువిదూఱు నబ్ధి జొఱ నఁబ్ధుల్ జొచ్చును
[ ద్వేగియై
దివిఁబ్రాకన్ దివిబ్రాకుదిక్కులకుఁబో దిగ్వ్యాధులన్‌బోవుఁజిక్క వెసం గ్రుంగినఁ గ్రుంగు నిల్వనిలుచున్ గ్రీడింపఁ
[ గ్రీడించు నొక్కవడిం దాపసు వెంటనంటిహరిచక్రంబన్య దుర్వక్రమై

అంత నా పారుండు భీరుండై భూలోకమంతయుఁ గలయం దిరిగె. కాని చక్రంబు మాన్పు వారెవరును గాన్పింపరైరి. ఎంతవారికైనను జేతులారఁ జేసికొన్నది యను

భవింపక తీరదుగదా! అంత నోడలు వడంకుచు స్వేదమ యం బయ్యె. నేల పదమానక తొట్రుపడుచుండె. చూపో పమి కనులు మూతవడుచుండె. మాటరాక నాలుక తడి యారుచుండె. గుండెలు దడదడ కొట్టుకొన వగర్చుచు నమరలోకంబునకుఁ బోయె.

అట దేవేంద్రుండు శచీసమేతుండై యఖిలామర మునిగణసేవ్యమానుండై సువర్ణరత్నఖచితసుధర్మాసనా సీనుండై నిండు పేరోలగం బుండె. వృద్ధతాపసి కరకమలం బుల ముకుళించి "ఓ పాకశాసనా! ఆపన్నుఁడ రక్షింపు మనుచు దీనవదనుండై మ్రోల నిల్చిన వాని గాంచి "ఓహో! దుర్వాసా! నీ కేమి యాపదగల్గె! నీ వెనుక చక్రినలజ్వాలలేమి" అని డిగ్గున గద్దియ డిగ్గి యంజలి పు టంబుల గదియించి "ఓ శ్రీమహావిష్ణుసుదర్శనమా! ఇదే నా ప్రణతులు గైకొనుము. ఓ శుద్ధసత్త్వమూర్తీ! సార మేయం బేడ. స్వర్గలోకం బేడ. శ్రీమహావిష్ణుచక్రబాధమాన్ప నా తరమా. వేఱొకని శరణు చొరుము అన నిరాశాహ తుండై యే లోకంబున కేగినను జక్రబాధ మాన్పువాఁడు లేమి దురంతసంతాపపీడితుండై సత్యలోకంబునకుఁ బోయె.

అట విధాత వాణీయుతంబుగ సుఖాసనాసీనుండై యుండ విన్నవోయిన మొగంబుతో, వాడి వత్తలయిన శరీ రావయవములతోఁ గనుకొలంకులఁ బొంగి పొరలు దుఃఖా

ఋషివరులతో "ఓ నలుమొగంబులదొరా! దైవభక్తులదూరిన ఫలం బనుభవించుచుంటి. ఇంక ముందెన్నడిట్టి యజ్ఞానంపు బనిసేయను. ఈ మెనుమంట లాపాదమస్తకంబు నన్నంటఁ గాల్చుచున్నవి. ఈ బాధ భరింపనోప రక్షింపు"మని వేఁడ, దూర్వాసా! విష్ణుచక్రంబు మాన్ప సమర్థుం డీ విశ్వంబున నెవ్వఁడైనం గలఁడే. మేమందఱ మాతని యడుగులకు మడుఁగు లొగ్గెదము. అదియుంగాక నే నాతని కడుపునం బుట్టిన యర్భకుండను. తండ్రి శిక్షించువాని తనయుఁ డెవ్వఁడైన రక్షింపఁజాలునే. కావున దక్షాధ్వరధ్వంసియగు శివుఁ బ్రార్థింపుము. అతండు రక్షింప నోపునేమో యనె. అంత మునికండు నిరాశాహతచేతస్కుఁడై కైలాసంబున కరిగె.

అట రజతాద్రిపైఁ బార్వతీపరమేశ్వరులు ప్రమథగణంబులు నల్దిశలఁబరివేష్టింప సిద్ధసాధ్యులు సేవింప విద్యాధరులు వినుతింప, గంధర్వులు గానంబు సేయ, రంభోర్వశీమేనకాద్యమరకాంతలు నృత్యంబు సలుప నప్సరసలు హారతులీయ నిండుకొలువుండఁ జింతాక్రాంతవదనంబుతో ముని డాయంజని "ఓ శంకరా! నిఖిలాశ్రితజనవశంకరా! రక్షింపుము రక్షింపుము" అనుచుఁబదంబుల కెఱఁగె. అంత నుమావల్లభుండు "నీ కేయాపద వాటిల్లె" ననవుడు మునిపుంగవుండు "శివా" యని యుచ్చరించినంతఁ బ్రాణుల కుభయలోకమ్ముల శుభము లొనగూడునఁట. నీ ధన్యనామస్మర

ణంబు గావింపుచు నీవే దిక్కని నీ పదంబులకడ వ్రాలితి. నను( బాలముంచినను నీళ్లముంచినను నీయదే భారము. చక్రబాధ సైప(జాల" నని పదంబుల( బట్టి విడువని మునిని గరంబున లేవనెత్తి "అయ్యా! ఆ పురాణపురుషు( బ్రతి ఘటింప( జాలువార లీ చతుర్దశభువనంబుల నొక్కరును లేరు. అతని శక్తి యద్భుతము. అతఁడు సర్వజ్ఞుఁడు. అతని చక్రం బెదురొ్కన నసాధ్యము. వెండియు మా యిర్వుర కభేదము. అతని భక్తులే నా భక్తులు, నా భక్తులే యతని భక్తులు. కావున నీవా శ్రీనివాసు చరణంబులు శరణంబు సొరుము" అని బుద్ధి(గఱుప ముక్కోపియగు ముదుతాపసి వైకుంఠంబున కేగె.

ఆ పట్టణ మందన్ని భూతలంబు లన్యోన్యమైత్రి(గల్గి సాత్వికాహారంబున జాడ్యజరామరణవర్జితమై, దివ్యజ్ఞాన సంపద( దేజరిలుచు, సచ్చిదానందమూర్తిమంతమై, యణి మాదిసిద్ధుల నొంది, త్రైలోక్యసంచారవిభవ సమ్మోదంబున( దేలుచు, నవవిధభక్తిమార్గంబుల నహర్నిశంబుల నప్పరా త్పరు సేవింపుచు( దన్మయత్వంబున దేహంబులు మఱచి యుండు. అట్లు సర్వశోభాయమానంబై విరాజిలు నా పట్ట ణరాజంబు గాంచి యాత్మ మెచ్చి ద్వారపాలకు గరుఁడుని యనుమతి( బడసి పరమహంసల బండెొందుర్ని వహారాల కాఁటి యావల ననతిదూరంబున ననుపమానసుందర సౌఖా

వతంసంబునఁ గనత్కనకమణిమయ విచిత్రరత్నాలంకార పరిశోభితంబై వెలుగొందు నొక యపూర్వసింహాసనంబున శేషశయానుఁడై రమావధూటీ సేవిత పదకమలుండైన శ్రీమన్నారాయణునిఁ గాంచి వాని పదసరోరుహంబుల వ్రాలి

ఉ॥ నీమహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగలేక నీ
పేరిమకు వచ్చు దాపులకుఁగ్రించుఁదనంబున నెగ్గుసేసితిన్
నా మఱపుర్క సహింపుమట నారకుఁడైనమనంబులో భవ
న్నామము చింతఁజేసిన ననంత సుఖస్థితి నొందకుండునే॥

యని ప్రార్థించె. అంత శ్రీకాంతుండు "ఓమునిముఖ్యా! తపోనిధినని గర్వించి నిష్కారణంబుగ నా భక్తుని బాధించితివి. అతఁడు నీ కేమొగ్గొనరించె. ఎవరికిఁగాని పాపఫలం బనుభవింపక తీరునా?

ఆ॥ వె॥ నాకు మేలుగోర నా భక్తులకెగాని
భక్తజనుల కేను పరమగతియుఁ
భక్తులెందు జనిన బరతెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు కోడెభంగి॥

ఇపుడు నా చక్రంబు మరలింప నే నసమర్థుండ. అస్వతంత్రుండ. ఏలనన భక్తి లతాపాశంబులఁ దమ మనోగృహంబుల నను నా భక్తులు దృఢంబుగాఁ గట్టివైచిరి. వెండియు నాకును నా భక్తులకును భేద మిసుమంతయును లేదు. వారే నేను. నేనే వారు. కాన నీవా యంబరీషుని కడ కేగి

యతనిఁ బ్రార్థింపుము. అతఁడు కరుణాళుండగుట నిన్నవ శ్యంబు రక్షించు" ననె. అంత సంయమి రయంబున మర్త్య లోకంబున కరిగి య య్యంబరీషుని పదకంజంబులపైఁబడి యెల్గెత్తి దుఃఖించుచు "ఓ భక్తాగ్రగణ్యా ! భాగవతాపరా ధినౌట నను భగవంతుఁడుం గూడఁ గరుణింపఁడయ్యె. నా బుద్ధి యజ్ఞానంబునఁ బూరి గఱచినది. ఎందెందఱినో వేఁడితి. అందఱుంగూడ నోమందుడా గోవిందు భక్తు నెం దులకు దూరితి" వని మందలించిరి. కాని రయొక్కరును గావరైరి" అని విలపించు మునిని లేవనెత్తి కన్నీరు దుడిచి చక్రింబును

ఆ॥ విహిత ధర్మమందు విహరింతునేనిని
నిష్టమైన ద్రివ్యమిత్తునేని
ధరణిసురుఁడు నాకు దైవతం బగునేని
వీని కిపుడె సుఖము వెలయుఁగాక॥

అని ప్రార్థించి చక్రమును మరలించె. దూర్వా సుఁ డంబరీషుని నిశ్చలభక్తిఁ గొనియాడి వాని పంక్తిని సుఖపారణముఁ జేసి యాశీర్వదించి నిజావాసంబున కరిగె. దైవభక్తుల కసాధ్య మిలాధరణి నెందైనఁ గలదే ?

# రంతిదేవుఁడు.



మ॥ బలవంతంబగు నీరుపట్టున నిజప్రాణాంతమైయున్నచో
నలయం డేమియు వీనిహృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున మానుననుచుఁ గా సర్వేశ్వరాధీనుఁడై
జలముం బోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్”

భరతవంశమునకుఁ గడగొట్టువాఁడగు సంకృతికి గురుఁడు రంతిదేవుఁడను నాత్మజు లిరువురు గలిగిరి. అందు రంతిదేవుఁడు ధైర్యశౌర్యగాంభీర్యముల కిక్కయయ్యుఁ బర రాజ్యాపేక్షవీడి, యభినవమారసుకుమారసురుచిర గాత్రుం డయ్యు నేకపత్నీవ్రతుండై, మహదైశ్వర్యసంపన్నుఁడయ్యుఁ బంకకలిత మీనంబువలె వాంఛాపరుండుగాక సర్వ జనమాన్యగుణగణాలంకారుఁడై యఖిలదిక్తటంబులఁ దన కీర్తిచంద్రికలు నెగడఁ బ్రజలఁ బాలించుచుండె. కొలది వత్సరంబుల కతఁడు తన రాజ్యసర్వస్వము దీనులకును, వికలాంగులకును, దేవాలయగృహారామసత్రతటాకాది నిర్మాణంబులకును వెచ్చించి దరిద్రదేవతామోహితుఁడై భార్యాయుతంబుగ నరణ్యములకుఁ జనె. అటులా భూపతి సతీసుతులతోఁ బట్టణంబులఁ బల్లెల వనంబులఁ గ్రుమ్మరుచు క్షుత్పి

పాపనివారణోపాయంబు గానక పరమేశ్వరుఁ బ్రార్థించుచు నతిదైన్యవృత్తి నలువది యెనిమిది దినంబు లలమటించె. తుట్టతుద కొకనాఁడు మిగులఁ డస్సి మూర్ఛపోవు సమయమే తేర నచ్చోట నాజ్యపాయసపానీయంబు లచ్చెరువు దోప వారి కట్టెదుటఁ గానంబడె. అంత రేఁడు "ఓ దయాస్వరూపా! నీ కరుణామృత దృష్టి నిన్నాళ్లకీ దీనులపైఁ బ్రసరింపఁ జేసితివా? బిడ్డలఁ బోషించు భారము జనకునకుఁ గాక మఱి యేరికుండును. ఆహా! మాపై నీ కెంతటి ప్రేమ" అని పొగడుచు నుత్సాహంబున నారగింప నుద్యుక్తుఁ డయ్యె.

అంతట శుష్కీభూత దేహుండగు నొక విప్రుం డాఁకటి బాధచే నకనక లాడుచు "ఓ కరుణామయా! మూడు దినంబులనుండి యాహారంబులేమి నెంతయు గాసిఁజెంది యుంటి. కావున శీఘ్రంబ నా క్షుద్బాధ నడంపవే" యని జాలిగొలుపఁ బ్రార్థించె. రేని మనంబు కరగి హరి సమర్పణంబుగ నందర్ధభాగ మా యతిథి కొసఁగె. అతఁ డతి మోదంబున నప్పరమాన్నంబు గుడిచి సంతృప్తినేగె. రాజచంద్రుఁ డతిథిపూజ గావించితినని యమితోల్లాసంబున శేషాన్నం బాహరింప నాయత్తుఁ డయ్యె.

ఇట్లుండ నొక చతుర్థజాతిపురుషుం డశనార్థియై వచ్చి "అయ్యా! నే నారుదినంబులనుండి యన్నంబెట్టిదో యెఱుంగక మిగులనొగిలియుంటి. నీ విప్పట్టున నన్నంబు బెట్ట

వేని నా ప్రాణంబు లీక్షణంబున నస్వాదిపోవును. కావున: బట్టెడన్నంబు వెట్టి ప్రాణరక్షణ సుకృతంబు నొందుము" అనవుడు వాని పలుకుల కాదరంబు గదుర యా భూవిభుండు తచ్ఛేషంబులోఁ గొంతభాగ మాతనికిడి పరితృప్తుం గావించి పంపె.

తదనంతర మవనీశుఁడు భుక్తశేష మాహారింప సంసిద్ధుఁడగు డొక మనుజుండు శ్వాన సంచయంబుతో నరుదెంచి "ఓసదయహృదయా! నాకును వీనికినిఁ గొన్నాళ్లనుండి యన్నంబులేక మిక్కిలిసుక్కి ప్రాణావశిష్టులమై యుంటిమి. మానవుఁడు తన యవస్థ నొరుల కెఱింగించి యెట్టులో తనయిక్కట్టు మూలముట్టుగఁ బాపుకొనగలఁడు. కాని యీ నోరులేని జంతువులట్లు తమ కష్టము లొరుల కెఱుకపరచుకొనఁ జాలవు. కావ మము గరుణాదృష్టి నీక్షింపవే" యని యా క్రందనంబుఁ జేసె. నృపాలుని మనంబున దయారసం బుబికి మిగిలిన యన్నంబంతయు నర్పించి మొక్కి సాగనంపె.

ఔరా! ప్రభు రంతిదేవు నౌదార్యము. అతఁడు నలువది యెనిమిది దినంబులనుండి దారాపుత్రులతో నన్నపానంబులు లేక నవయుచుండె. తుద కదృష్టవశంబున నొకనాఁడతని కవి యెట్టులో లభ్యమయ్యె. అతండవ్వానిఁ గుడువ సంసిద్ధుండగు నెడ నొక బ్రాహ్మణుఁడును వాని

వెన్క నొక శూద్రుండును, నా వల నొకకిరాతుఁడును నని వార్యబుభుక్షాపీడితులై యరుదెంచిరి. ఆ పుణ్యమూర్తి స్వార్థ పరాయణుఁడు గాక తన కీశ్వరుండిడిన ప్రసాదంబుచే నతిథుల నాదరించె. పాపము! ఇక నతఁడాలుబిడ్డలతో నార గింప నేమున్నది. పరమేశ్వరుం డొసంగిన పవిత్రంబువులే కదా! అవి మాత్రము వారికి దక్కనను నాశ యే యున్నది.

అతఁ డీతూరి జలంబులనైనఁ గ్రోలి యసువుల నిలు పుకొందమను నాశతో నుండ నొక ఛండాలుండాతని మ్రోల నిలిచి "ఓ ఆర్తత్రాణపరాయణా! నేను బంచముఁ డను. లోకభీకరంబగు ప్రచండాతపంబునందూలి మార్గా యాస క్లేశంబుచే విదాహం బెక్కుడై నాల్క లోని కీడ్చు కొని పోవుచున్నది. ఇంక నొక్క యడుగైన నావల నిడఁ జాల. నీ జలకుండికలోని సలిలంబుల నొసఁగి నాయసురుల నిలుపుము" అనుచు నతఁ డాతని మ్రోలసాగిలఁబడె. దయా ర్ద్రహృదయుఁడౌ నృపాలుఁ డాతని విషమస్థితిని స్వయముగ నవలోకించి విచారంబుతో

ఉ॥ అన్నములేదు కొన్ని మధురాంబువు లున్నవి త్రావు [మన్నర
మ్మన్న శరీర ధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చివారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే

లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడసుమ్ము
[ పుల్క-సా॥

అనుచు మిక్కిలి డప్పిఁగొని మరణాసన్నంబయ్యె నలయకుండు వీని హృజ్జ్వరము నాయాస ఖేదంబులును నా జలదానంబున మానుగాక" యని తా సర్వేశ్వరాధీనుఁడై "ఇవే యీశ్వర ప్రసాదిత విమలపానీయములు. వీనిఁ గడుపాఱఁ గ్రోలి నీ ప్రాణంబులఁ గాపాడుకొనుము" అని వాని పాత్రింబున జలంబులఁబోసెను. తత్క్షణంబ పరమాద్భుతంబుగ బ్రహ్మ విష్ణు మహేశ్వరాద్యమరు లత్యంతానంద మొందిరి రంతిదేవున కుపకృతిసేయ మానంబునఁ దలంచి స్వస్వరూపములతోఁ బటఁ బ్రత్యక్షమయిరి. వెండియు నా భూపాలుని నిశ్చలతత్వ పరిశోధనార్థమై తాఁలూనిన వృష తాని రూపంబులెల్ల విష్ణుమాయగా నెఱిఁగించిరి. నరనాథుఁ డమిత హర్షంబున గేల్మోడ్చి గీలించి "ఓ పురాణపురుషులారా! నేఁడుగదా నా జన్మ చరితార్థంబయ్యె. నా జీవితంబు పవిత్రింబయ్యె. నా పాపపుంజంబులు పటాపంచలయ్యె. దేవాదిదేవు లరగు మీమాయ దెలియఁ గించిజ్ఞుఁడనగు నే నెంతవాఁడ. ఇట్టులగుట మీ యపారకృపామహిమ గాక వేఱున్నదే" యని సముచితాలాపంబుల భక్తి రసావేశుండై వారల నందఱఁ దనియించె. తదుపరి నా త్రిగుణాత్మక స్వరూపు లమితప్రీతి నాతని కౌఁగిలి నిద్రిరుజాజ రామరణా

దులు లేకుండ నట్లమూల్య వరంబులొసంగి యంతర్హితు
లైరి.

ప్రతిజ్ఞాధురీణులగు వారొరులఁ జేసాచి యాచిం
పరు. ఏమన నల్పులు తాము కావించు స్వల్ప
కార్యంబుల ఘనంబుగ నెంచి కొండంత ఫలం బభిలషిం
తురు. కావుననే రంతిదేవుఁడు దేవదేవు నే వరంబులఁ గోర
నుత్సహింపఁడయ్యె. కాని యా యమలచరితు మనం బెల్ల
పు డంబుజోదర పాదారవిందచింతనాసక్తత నుప్పొంగుచుండు
ఆ త్రుతిత్రయోత్తముండు జ్ఞానకుతారంబు గేలఁబూని ప్రకృతి
యను సాంద్రారణ్యంబులోని యరిషడ్వర్గంబులను మహా
వృక్షంబుల సమూలంబుగ ఛేదించి ముక్తిపథంబునకు భక్తి
యను రాజబాట నేర్పరుచుకొనిెను. కొలది కాలంబున
కాతని యాంతరంగికభక్తికెంతయు సంతసించి రమావల్ల
భుండు కనకరత్నఖచితంబైన విమానంబుఁ బుత్తెంచి సతీసు
తసమేతంబుగ మహావైభవంబుతో రంతిదేవునిఁ దన చెంత
కుఁ దెండని నిలింపముఖ్యుల నియమించె. వారలట్లు భూమికి
డిగ్గి రంతిదేవు నాలుబిడ్డలతో నం దాసీనునిం జేసి, పుష్ప
దామంబుల నలంకరించి దివ్యలోకంబునకుఁ గొనిపోయిరి.

దానంబులన్నిట నన్నదాన సమంబగు దానంబులేదు
అద్దాని మహిమ పొగడ నమరులకుంగూడ నలవికాదు. ఆ
కారణంబుననే మన దేశమునందలి జనులు తమ గృహంబు

లకు బంధుమిత్రులేకాక నూతన స్త్రీపురుషు లెవ రరుదెంచినను మహాభాగ్యంబుగ నెంచి వారిని భోజనాదికంబులచే నాదరించుటయు, విశేషధన మన్నదానంబులకును, సంతర్పణలకును వినియోగించుటయు నీనాటికిఁగూడ నాచారమై యున్నది. ప్రపంచమం దన్ని ఖండములలో భరతఖండమన్న దానమునకు సుప్రసిద్ధమేకదా!

# పృథుఁడు.



సీ॥ తలపోయ బ్రహ్మవిద్యార్జనముల
కనయంబుఁ గింకరుండైనవాఁడు
నఖిల శరీరగుఁ డాప్త సుహృజ్జన
తానంద కరుఁడన నలరువాఁడు
సంసారఘనకర్మ సంగహీనులయందు
సంగసంప్రీతుఁడై జరుగువాఁడు
దుర్మార్గ మనుజ సందోహంబునకు నుగ్ర
దండధరుండనఁ దనరువాఁడు

గీ॥ ప్రకృతి పురుష కావేశుఁడై పరఁగువాఁడు
భగవదవతారయుక్తుఁడై నెగడువాఁడు
నగుచు వర్తించు సమ్మోద మతిశయిల్ల
చారుతరమూర్తి పృథురాజ చక్రవర్తి॥

వేనుండను నృపాలుండు దుష్టబుద్ధియై ఘోరదురితంబుల నాచరించుచు సాధుసజ్జనద్రోహ మొనరించుచుఁ గరుణాశూన్యుఁడై ప్రజలఁ బలుబాములఁ బెట్టుచుండ మునులందఱాతని యెడఁగుపితులై తపోమహాగ్నిచేఁ బొలియిం

చిరి. అంత రాజ్యం బరాజకంబగు డా జనులు జారచోరాది బాధల దినంబుల యుగంబులట్లఁ గడుపుచు నన్యోన్యహింసలఁ దెలంగుచు నస్వస్థచిత్తులై సత్ప్రభునిరాకకై నిరీక్షించుచుండిరి. మహర్షు లీ దుర్భరస్థితిఁ బొడగాంచి తదుపశమనార్థ మా వేనుని కళేబరంబు డాసి బాహువుల మథించిన నారాయణాంశంబునఁ బృథునామకుండగు నొక శిశు వుత్పన్నుండై పృథుచక్రవర్తినాఁ బ్రఖ్యాతుఁడయ్యె. భూసురు లా రాకొమరునకు మహదాశీర్వచనంబులఁ జేసిరి. అతఁ డుదయాద్రింబొడుచు బాలభాస్కరుని వడువున వెలుఁగుచుఁ గొలది వత్సరంబులకు యుక్తవయస్కుండయ్యె. అతని దక్షిణ కర పల్లవంబున రమారమణీయ మనోహర లలితాయుధ చిహ్నంబులును, నంఘ్రిల సమగ్రహాలాంకుశ భాస్కర కులిశధ్వజ చాపసరోరుహశంఖ రేఖలును విరాజిలఁ గని బ్రహ్మాదులగు బ్రాహ్మణు లమితముదంబు నొందిరి. పౌరు లాతని సత్యశౌచశమదమాదుల కత్యంతానురక్తులై వానిఁ బ్రభునిఁగాఁ జేసికొని మహానందభరితులైరి. వాని సుఖ పాలనంబున గత కష్టంబుల నెల్లఁ గ్రమక్రమంబుగా విస్మరింపుచుండిరి.

ఆ మహారాజు సముద్రనిభంగి గభీరచిత్తుఁడై వాసవుఁబోలి శాత్రవాసహ్య ప్రతాప యుక్తుఁడై, పావకురీతి నన్యదుస్స్పర్శనుఁడై, చారులపలన సకలప్రాణి బాహ్యాంతర

కర్మంబుల( దెలియుచు దూషణ భూషణంబుల నుదాసీనుం డై ధర్మపథానువర్తియై, స్వపరభేద మావంతయు( జూపింప క దోషుల దండించుచు, నిర్దోషుల ననుకంప( బోషించుచు( బ్రజలయెడ( దండ్రివలె( బ్రీతి( బాలించుచుండె. ఆ పృథ్వీ శుం డొకనా(డు హేమ మణిమయ స్యందనంబెక్కి దిగ్విజ యార్థ మరివీరులపై దాడివెడల వా రుపాయనంబుల నుపాయ నంబుల నర్పించి సఖ్యమొనర్చుకొనిరి. తక్కింగల విరోధి వర్గ గర్వతమసం బడగించి సఫలమనోరథుండయి స్వరా జ్యంబున కేతెంచె.

ఇట్లు పెక్కేండ్లరిగిన( బిదప నీరసయగు ధరిత్రి యం దన్నరహితులగు ప్రజలు శుష్కీభూత దేహులై రాజు నిఁజేరి "ఓ సార్వభౌమా! తరుకోటరంబున( దగులొక్కొన్న యనలం బా వృక్షమును సమూలంబుగ దహించుమాడ్కి మే మాహారహీనులమై కృష్ణపక్షేందుచందంబున క్షీణించి మృ త్యువాత( బడనుంటిమి. కావున( గృపాయత్తచిత్తుండవై మమ్ములఁ గాపాడుమ"ని కుయ్యిడ సాగిరి. అంత జనపతి క్రోధారుణ నేత్రుండై కోదండం బెక్కువెట్టి ప్రళయకాల రుద్రునివలె( గన్పట్ట నిల గోరూపమున( బ్రకంపించుచు వ్యాధునిఁగాంచి భీతిబఱచు హరిణశాబకంబుకైవడి( బఱచు చుండ నవనిపు(డు ద్విగుణీకృత ప్రతాపంబుతో నద్దాని వెన్నాడె. అంత మేదిని యనన్య శరణ్యయై విచారాందోళ

నామిళిత డోలాయమానమానసయై “ఓవైన్యా! నీవు ధర్మ నిరతుండవు. వెండియు నాపన్నరక్షకుండవు. అట్టి నీవు కామినియుఁ బాపరహితయునగు నను వధియింప నేల వెం డగులు చున్నాఁడవు. ధర్మతత్త్వజ్ఞులు సతీజనంబులు సాపరా ధలయ్యు నవధ్యలని తెలియవా! అది యటులుండనిమ్ము. నే నీ ప్రజల నందఱ దృఢ శరీరంబుతో నాయందు నివసింపఁ జేసి యానపాత్రివలె వారల కాధారభూతనై యే యుపద్ర వంబునకును లోఁబడనీక సంరక్షించుచుంటిగదా? అట్టి ననుఁ గూల్చినచో నీభూజనంబుల జలంబులమునుఁగకుండ నెటులఁ గాపాడఁ జాలెదవు” అని వినమ్రయై పలికె. పుడమిఱేఁడు “ధరిత్రీ! నీవు హవిర్భాగంబుల నాహరించి ధాన్యాదికంబుల వృద్ధినొందింప కుంటివి. వెండియు గోరూప ధారిణివై కసవు మెసవుచు క్షీరంబుల నొసఁగక నీయందణగించు కొంటివి. అదియుఁగాక మున్ను నలువచేఁ గల్పింపఁబడిన యావధ బీ జంబుల నీయందిముడ్చుకొని వాని నిప్పుడీయక మందమతి వై మదాజ్ఞోల్లంఘనంబొనర్చి కృతాపరాధవైతివి. ఇట్టి ని కృష్టురాల వగుట నిన్ను నా తీవ్ర నారాచంబులఁ బోడిమిఁ దూలించి క్షుత్పిపాసా పీడితులగు దీనజనుల యార్తి నివర్తిం చెద. నీవు కామిని నంటివి. స్త్రీ పురుషులలో నెవ్వరేని భూ తదయా విరహితులై స్వకుక్షి రక్షణమాత్ర జీవిత చరిత్రు లయిరేని వారిని వధించుట పాతకంబు గానేరదు. ఓసీ! నీవు

కామిని వైతెనను దుర్మద వగుచు మాయాగోరూపంబున ను సలిపారి పోఁజూచు చుంటివి. అట్టి నిను ఖండఖండంబులుగఁ జీల్చి యోగమహిమ ప్రాణికోటి సముద్ధరించెద” అని మే ఘ గర్జారవంబుప్పతిలఁ బలుకు చక్రవర్తిఁజూచి పుడమి గడగడ వడంకుచు, మహాత్మా! తొల్లి రసాగతనైన నన్ను దివరాహమవై దయాతిరేకంబున నుద్ధరించితివి. అట్టి యు దకాగ్ని మందున్న నే ననెడి నావ యందలి ప్రజాళి రక్షింపఁ బృథురూపధారివై జన్మమొందిన పురుషోత్తముండవు. నీ వీ సకల చరాచర సర్గంబు నిర్మించి ధర్మతత్పరుఁడవై తనరు నాదిదేవుఁడవు. అట్టి నీ చేష్టితంబులఁ దెలియ నలవియ గునా. ఓ పురాణపురుషా! నీ శరణంబుఁ జొచ్చి నమస్కరిం చుచున్నాను. నీ యుదగ్ర కోపంబుడిగి దయామతి నా మ నవి నాలింపుము. తొల్లి పరమేష్ఠిచే నిర్మింపఁ బడిన యోష ధీనిచయంబులెల్ల దుర్జనులును జంచలవ్రతులునునగు మాన వులచే నాహరింపఁబడి వారి దురితంబులు మేరమీఱి మీ రలుడుపమి నెల్లలోకంబులు దురంత వేదనా పరిపీడితంబు లయ్యె. అద్దాన నా శరీరాంగకములు కృశీభూతంబులై క్రి తువు లనవరతము చేయఁబడమి పాపభూయిష్ఠంబైన మగిడి యధ్వరవృద్ధికై యోషధుల మెసవితి. అవియెల్ల నా లో నిపుడు జీర్ణంబయ్యె. నీవు వాని వెలిగొనఁదలంతేని నను సమస్థలిఁ బొంపొందఁజేయుము. అంతట నొకవత్సంబును

ననురూప సుదోహనంబునఁ గల్పించిన నీ యభీష్టంబులనెల్ల నెరవేర్చెద” నని హృద్యంబుగఁ బలికె. అంత రాజముఖ్యుఁ డమితామోదంబున

చ॥ మనువును దూడఁజేసి గరిమన్ నిజపాణితలంబు లీల దో
హనముగఁజేసి యందు సకలౌషధులం బిదికెంగ్ర [మంబునన్
దనరగఁ దద్విధంబున న దత్పృథువత్సలయైన భూమియుం
దనయము వారువారును బ్రియంబగు కోర్కెలునొంది [రున్నతిన్॥

అంత నృపాలుం డెక్కువెట్టిన కార్ముకంబునఁ బ్రతిజ్ఞా పరిపాలనార్థ మచలరాజ శిఖరంబులపైఁ బ్రయోగించి చూర్ణీభూతంబుఁ జేసి తత్ప్రదేశంబెల్ల సమతలంబుగ నొనర్చి యాచటఁ బల్లెలఁ బట్టణంబుల సత్రాలయ ఘోష వాజీవాటుల నిర్మింప వివిధ జను లచ్చోట నివసింపుచు నవ్వైన్యుని కీర్తి నినుమడింపఁజేసిరి.

అటులా రాజన్యమౌళి రాజ్యమవక్రవిక్రమంబునఁ బాలింపుచు నశ్వమేధ శత సంపూర్తిఁగావింప సంకల్పించి బ్రహ్మావర్తంబున వెలయు మనుక్షేత్రంబున సరస్వతీతటంబున యజ్ఞశాలలు నిర్మించె. శతక్రతుఁ డీ సమాచారంబుఁ దెలిసి తత్క్రతుశతంబున నమితఫలంబునొందునని కుపితుండై విఘ్నమాపాదింప వేచియుండె. పరమ భాగవతోత్తముఁడైన

పృథుచక్రవర్తి యాజనం బుపక్రమించె. క్షోణీతలం బెల్లపదార్థంబుల నౌత్సుక్యంబుగ నిడ, మహీజంబు లతిరుచిమంతంబులైన ఫలంబుల నొసఁగ నదీనదంబులు దధిక్షీరాజ్యతిక్రంబులఁ బ్రవహింప సముద్రంబులు హీరాది రత్నవిశేషంబుల నీయఁ, బర్వతంబులు భక్ష్యభోజ్య లేహ్యచోష్యంబులను జతుర్విధాన్నంబులఁ గురియుచుండె. ఇటులఁ బరిపూర్ణవిభవాభిరామంబుగ నేకోనశతాశ్వమేధంబులు సన్మేధంబునఁ గావించె. అతండొనరించు నూఱవ యజ్ఞంబునకు యజ్ఞపతియైన పుండరీకాక్షు నమఃపూర్వకంబుగ భజియించుచుండ నసూయావేశుండైన యమరవల్లభుం డంతరంగంబున రోషంబుపాటించి తురంగంబును దొంగిలించి చనుచుండె. అత్రిమహర్షి యశ్వంబుఁ గొనిచను నింద్రునిఁ బోల్చి రాకొమరున కా యుదంతంబుఁ దెల్పి యద్దాని విడిపించుకొనిరాఁ బ్రోత్సహించె. అతఁడు ధనుస్తూణీరంబులఁ దాల్చి నిలునిలుమని యార్చి గుణధ్వనిఁ జేసి యతని సుత్రాముగా నెఱింగి సాయకంబులఁ బరపఁ జాలకుండె. అంత ఋషివృషభుండు "కుమారా! ఇతఁడు యజ్ఞహంత. కావున వీని జయించి హయంబునుఁ గొనిరమ్ము" అని హెచ్చరించె. రాజనందనుఁడు మృగరాట్కిశోరంబు మదేభంబుపై కురుకుమాడ్కి లంఘించి వ్రాలిన నతండు భీరుండై తదశ్వమును విడిచి యంతర్హితుండయ్యె. మునీంద్రులా రాకుమారు

నత్యద్భుత పరాక్రమంబున కచ్చెరువొంది యతనికి జితా శ్వుండను సార్థకనామము నుంచిరి. నగభేది యంతఁబోక మగిడి గాండాంధకారంబుఁ గల్పించి తన్మధ్యమున నగోచర వర్తనుండై రత్నాలంకారశోభితంబైన యూపస్తంభమునకుఁ గాంచనపాశబద్ధంబైన హయరాజంబును నన్యదుర్విలోకనం బుగాఁగొని చనుచుండె. ఋషివరుండగు నత్రిచేఁ దెలుపఁ బడి పృథుకుమారుండు చెచ్చెరఁజని కపాలఖట్వాంగముల ధరించి చను నిందునిఁ గాంచి నిల్వరింపలేక

ఉ॥ శక్రమ్మునత్రిచేఁ దెలుపఁగాబడి వైన్యతనూభవుండు రో
షమ్మునఁ దోక ద్రొక్కిన భుజంగము పుంగవుఁ బోలి [యుగ్రుఁడై
యమ్మురిబోసినంగని సురాధిపుఁ డెప్పటియట్లఁ బాఱె న
శ్వమ్మును రూపమున్విడిచి చాల తిరోహితుఁడై రయం [బునన్

అట్లు విడిచిన వాజింగొని మరలి పిత్రు యజ్ఞశాలకుం జని యంతయు నివేదింప నరేంద్రుఁ డమరేంద్రునిపైఁ నిశితశర సంధానంబు సేయ నుద్యమింప ఋత్విక్కులు "భూపకుల లలామా ! మఖంబుల వేదచోదితంబులగు పశు బంధనాది హింసలేకాని దీక్షితుండైన వాఁడన్యహింసలఁ జేయఁ బాడిగాదు. కాన నీవిపు డింద్రవధోద్యోగంబుపసం హరింపుము. మేమా పాకశాసనునిట కాహ్వానించి యనల శి

ఖాకలాపమున కాహుతి గావింతుము. అంత నతఁడు విగత వీర్యుండై చెడు" నని స్రుక్స్రువంబులఁ బూని పేర్వేర నగ్ను ల వేల్చుచుండ! నాసమయంబునఁ బితామహుం డరుదెంచి "హవిరోభ్యక్తయు, యజ్ఞేశ్వరుండునగు నిందుృఁడధ్వరవిధ్వంస నేచ్ఛ ధర్మవ్యతిరిక్త కృత్యంబుల సల్పినను ప్రతీకారంబు నేయఁజనదు. పృథుకీర్తి యుతుండవగు నో రాజా! నీకు నే కోనశతాధ్వర ప్రయోగంబుసిద్ధించుఁగాక. వెండియు మోక్ష ధర్మంబుల నెఱింగిన నీవు యాగంబులఁ జేయ నెంచుట చం పక పుష్పమునకుఁ జేవురురంగు వేయుట కాదె" యనె. అం త వాణీశు వచనంబుల నాదరించి దివిజేంద్రునిపైఁ గ్రోధ ముడిగె. అవల నవభృథానంతరమున

చ॥ సురుచిరలబ్ధ దక్షిణల సొంపునబొంపిరిపోయి భూసురుల్
వరుసను బెక్కు దీవన లవారణ నిచ్చిరి సర్వదేవతల్
భరితముదంతరంగములఁ బాయనివేడ్క వరంబులిచ్చిరా
నరవరుఁడైన వైన్యునకు నందితకీర్తికిఁ బుణ్యమూర్తికిన్॥"

ఆ సమయంబున దేవాది దేవుండైన సర్వేశుండింద్ర సమేతుండై వచ్చి "ఓ పుణ్యచరితా! ఈతఁ డొనర్చిన మ హాపరాధంబునకు క్షమాపణ వేఁడుకొనుచున్నాఁడు. వీనిని సైరింపుము. వెండియు నీవర్థకామంబుల నాసింపక విప్రాను మతంబున సత్ప్రథానువృత్తిఁ జరించితివి. నీ నిశ్చలభక్తి కేనెం తయుఁ బ్రీతుండనైతి. నీ యిచ్చవచ్చిన వరంబొందు వేఁడు

ము" అను నమృతోపమానములగు వచనములు వీనులఁ బడ నమందానంద కందళితహృదయారవిందుండై పదంబుల వ్రాలి యమ్మునీంద్ర దుర్లభ సందర్శ నానందంబున రోమ హర్షణ మెసఁగ గద్గదకంఠుఁడై

చ॥ ఘనమగు దేవ యీవర మె కాదు మహాత్మక వాగ్వినిర్గతం
బనఁదగు తావకీన చరణాంబుజ చారుమరందరూపమై
తనరిన కీర్తియున్ విని ముదంబునఁ బొందగలేని మోక్షమై
నను మదిఁ గోరనొల్ల నఘనాశర మేశసరోజలోచనా॥"

కావున నోదేవా! నీ యశంబు వినుటకు దశసహస్ర వీనులను నిను వినుతించుటకు శత సహస్ర జిహ్వలను నొసంగుము" అని సముదిత హృదయుండై పల్కిన పృథుసార్వభౌముఁ గరుణాదృష్టిస్వీక్షించి "నాయెడ నీకిట్టి నిర్మలభక్తి గల్గు కతన మహామోహితంబైన భవార్ణవంబు నవలీల దరింతువుగాక" అని ప్రియంబునఁబల్కి హరిహరితో నంతర్థానుఁడయ్యె. అంత నందరానందంబునఁ దమ మందిరంబుల కరిగిరి.

భూవిభుం డర్చియను పతివ్రతా తిలకంబునందు నే వురు పుత్రులఁ బడసి చిరకాలము ప్రజలఁ బాలించి యొక నాఁడతని వార్ధక్య ముపలక్షించి రాజ్య మగ్రసుతుఁడగు విజయాశ్వున కర్పించి తాను ప్రియాంగనా సమేతంబుగఁ వనంబున కరిగె.

అట్లు చని సనత్కుమారాదేశమున బ్రహ్మవిద్య నంది యోగమార్గవిధిఁ బరిపూర్ణభక్తి వొడమి సాయుజ్యంబుఁ జెందఁ బ్రాణవాయువులఁ బంచభూతంబులం దైక్యంబుఁ జేసె. అంత నతికౌతుకంబున ననుకూలవతి యగు నతని సతి యర్చి సహగమన మొనర్చి దేవతలు స్తుతింప నాథునితో త్రిదివమున కేగె.

---

## పరశురాముఁడు.



మ॥ ప్రళయాగ్నిచ్ఛటభంగిఁగుంభివిదళింపం బారుసింహాకృతిన్
బెలుచన్ రాముఁడిలేశు వెంటనడచెన్ బృథ్వీతలంబెల్ల నా
కులమైక్రుంగఁగుఠారియైకవచియై కోదండియై కాండియై
ఛలియై సాహసియై మృగాజిన మనోజ్ఞశ్రోణియైతూణియై"

పరమపావనంబగు భాగీరథీ తటంబునఁ గన్యాకుబ్జమను పట్టణం బొండుగలదు. అద్దాని కధినాథుండు గంగాంబుల నొక్కమారు పుక్కిటఁ బెట్టుకొన్న జహ్నుమునీశ్వరుండు. అతని వంశజులలోఁ గడఁ గొట్టువాఁడగు గాధిరాజునకు సత్యవతియను కుమారీలలామంబు గలదు. ఆమె వివాహోచిత వయస్కురాలయి నిండు జవ్వనమునఁ దేజరిలు

చుండె. ఒకనాఁటి ప్రాతఃకాలమునఁ దవః ప్రభావిభాసమా నుండగు ఋచీకుండను ముని మండల మండను డా మండలే శ్వరు నిండుకొలువున కేతెంచె. ధరాధినాథుఁ డమ్ముని నాథు నర్ఘ్యపాద్యాది పూజల భక్తిగౌరవంబు లొప్పారఁ బూజించి యాతిథేయ సత్కారము లొనర్చె. తపసి యిన్న యారాకన్నె యందచందంబుల మున్నె విన్నవాఁడగు డారా సుతఁ దనకిచ్చి వివాహంబు సేయుమని భూకాంతుఁ బ్రార్థించె. తన పుత్రికా రత్నంబున కాతఁడు తగిన వరుఁడు కాఁడని యెంచి ముని నెదిరించి వాక్రుచ్చుటకు సంకోచించి "ఓ మునికులచంద్రమా! మా యింటిపడుచుల నెవండు పరిణ యంబాడు నాతండు మద్వంశాచారానుసారంబుగఁ దెల్లని నవకంపు మేనులును నల్లని చెవులునుం గల సహస్ర హయం బుల నుంకువగ నీయవలయు. ఇద్దాని నీ వాచరింతువేని నా యాత్మజను నీకిచ్చి పెండ్లి సేతునని వాగ్దానంబు సేసె. ఋచీ కుండు రయంబున వరుణునిపాలి కరిగి తల్లక్షణంబులుగల వాజులఁగొనివచ్చి రాజునకిచ్చి సత్యవతినిఁ బాణిగ్రహణంబు సేసికొనియె.

భృగు మహర్షి తనపుత్రుండంత తడయుట కేమి కతంబని చింతించి యంతరదృష్టి సర్వంబు నెఱింగి రయంబు నఁ బయనంబై యొక దినంబునకే యప్పట్టణంబునఁ బ్రవే శించి వియ్యంకునిచే సపర్యలనంది విద్వజ్జనుల మ్రోలఁ

దత్త్వార్థంబుల నుపన్యసించుచున్న తనయు సతీసమేతంబుగ రా నాజ్ఞాపించిచనె. పితాజ్ఞ మౌళిఁదాల్చి ఋచీకుం డట్ల ప్రియాన్వితంబుగఁ బయనంబయ్యె. పిప మా రాజదంపతు లమిత దుఃఖ మపనయించుకొని కూఁతునకును జామాతకు ను వివిధాంబరాభరణంబు లొసంగి దీవించి వీడ్కొల్పిరి, అంత నా వధూవరు లతిరయంబున స్వాశ్రమంబు సేరి వృద్ధులగు ముని దంపతుల నమితభక్తి సేవింపుచు సుఖంబుగఁ గాలంబు గడపుచుండిరి.

కడుంగడు గారవంబునఁ బెంచిన సత్యవతి నెడఁబాసి చాలకాలంబగు గాధి దంపతు లాత్మజావలోకనాయత్త కౌతూహలమానసులై జామాతృ నాశ్రమంబున కరుదెంచిరి. ఆ సమయంబున సత్యవతి ప్రాణనాథు పజ్జంజేరి "నాధా! పుత్రసౌఖ్యముకంటె వేఱొం డీ ప్రపంచమునలేదు కదా! అట్టి సౌఖ్యంబున కింతదనుక యే నోఁచుకొననైతి" నని నిరుత్సాహయైయున్న భార్య నూరార్చి "ప్రియా! నీ వింతమాత్రంబున కింత వంతం గూరనేల. నీ యాప్తితా ర్థవ్యాప్తికే నొండు చరువు నిర్మింతు. అద్దానఁ గులవర్ధనుఁ డగు కొమరుఁ డుదయించు. ఇంక నేదేని మఱియొకదానిఁ గోరుకొమ్మిచ్చెద" నన మునివతంసా! మా యమ్మ యీ వఱకు నన్నే కొమరునిగను కూఁతునిగను జూచుకొని యా నందించు. నీ చెట్టవట్టి యిట కేతెంచు టిప్పు డాభాగ్యం

బును నామెకుఁ గొఱంతయయ్యె. పుత్రులు లేమి మా తల్లియుఁ బెల్లు దురపిల్లుచున్నది. ఆమె సంతానంబువడయు నుపాయం బానతీయఁగదే” యని ప్రార్థించిన నా ముని పుంగవుండు సంతసించి రెండు చరువులు నిర్మించి తత్ప్రభా వంబులు వేర్వేఱ నుడివి వాని నుపయోగింపుడని యాతఁడు స్నానార్థం బరిగె. ఆ చరువు లుపయోగించునపుడు ప్రమా దవశంబునఁ గూఁతు చరువు తల్లియుఁ దల్లి చరువుకూఁతు రును నుపయోగించిరి. అంతఁ గొంతకాలంబున కా తల్లిబిడ్డ లిరువు నంతర్వత్నులయిరి.

ఒకనాఁడు ఋచీకుం డాత్మపత్ని నవలోకించి యా మె యాననంబున సత్వంబునకు మాఱుగొంత క్రూరత్వంబు వొడగట్టుటకు శంకించి తత్క్షణ మంతర్వీక్షణ కళామహాత్వం బున “సతీ ! నీకుఁ గ్రూరకర్ముండును మహాబలుండునునగు సుతుం డుదయించు. నీ జననికి బ్రహ్మతేజుండును దపో ధనుండునునగు వాఁడు జన్మించు” ననె.

సత్యవతి యుల్లంబు తల్లడిల్ల “వల్లభా! బ్రహ్మతేజో విభూషితులరగు మీకుఁ గ్రూరకర్ముం డుదయింప నోర్వఁ జాల. నన్ననుగ్రహింపఁగదే” యని వేఁడిన నాతఁడు “కా నిమ్ము నీ పుత్రునకు లేకుండ ననుగ్రహింతు. నీ పౌత్రుని యందుఁ దప్పక యావహిల్లు” నని వచించె. అంత సత్య వతికిఁ దపోనిరతుండును దాంతుండును శాంతుండునునగు

జమదగ్ని గలిగె. గాధిపత్నికి బ్రహ్మర్షి సదృశుండగు విశ్వామిత్రుండు పుట్టె. జమదగ్ని రేణుకను వివాహమాడి తొల్త వసుమన్వాదులను గడపట లోకోత్తరుండును నారాయణాంశ సంభూతుండుననగు పరశురామునిఁ బడసెను.

జగంబున భూతహింసయు, నాస్తిక్యంబును, సాధు సజ్జనపీడయు, మెండగునపుడెల్ల దుష్టులఁ బరిమార్చి శిష్టులఁ గావఁ దానవతరింతునను భగవద్వాక్యానుసరణంబున నా దేవదేవుండు లోకోపకారార్థ మిట్లావిర్భవించె. అతఁడు దినదినప్రవర్ధమానుఁడగుచు నెల్ల వేదశాస్త్రంబుల నేర్చి యుక్తవయస్కుండయ్యె. విశ్వామిత్రుండు రాజధర్మంబుమాని తపోబలంబునఁ బ్రహ్మర్షియగుటకుఁ బ్రయత్నించె.

ఒకనాఁటి ప్రాతఃకాలంబున జమదగ్ని భార్య రేణుక జలంబులఁ దేరఁ బాత్రిగొని నదికేగె. అచటఁ జిత్రరథుఁడను గంధర్వుఁడు ప్రియాంగనావ్రాతముతో నుత్సాహంబున జలకేళి సల్పుచుండె. ఆ వినోదదర్శనోత్సుకత్వంబున నామె పరవశత్వంబు నొంది యట కొంతతడవు నిలిచి గృహంబున కేతెంచె. తపస్వి జనాగ్రగణ్యుండైన జమదగ్ని యావృత్తాంత మంతరంగమునఁ దెలిసి "ఓసీ! జలంబులకేగి యింత జాగొనరించితేమి? యన నామె భయంబున మారు వల్కకుండె. అంత మునిసింహుం డలిగి "తనయులారా! ఈమె చిత్తం బన్యథాపరివర్తితం బైనట్లు తోఁచెడిని. తక్ష

ణ మీపె శిరంబును దెగవేయుడని వారల కాజ్ఞాపించె. వారు మాతృవధ మహాపాతకంబని యద్దాని కంగీకరింపరైరి తుదకుఁ గనిష్ఠుఁడగు పరశురాముఁ జూచి "రామా! దోషురాలగు నీ జననిఁ గడదేర్పుమని నీ యగ్రజన్ముల కానవెట్ట వారలు నా వచనంబులఁ ద్రోసిపుచ్చిరి. నీవైన నా యాజ్ఞ బాలింపు మనవుడు "తండ్రీ! లోకంబునఁ బితృవాక్య పరిపాలనంబుకంటె వేఱొండు ధర్మంబుగలదా" యన ముని లోకభాస్కరుండు తన యాజ్ఞోల్లంఘన మొనర్చిన కుమారుల నెల్లరఁ బశ్వులగుడని శపించి, పరశురామునిఁ జూచి నీ జననిఁ జంపుమన పితృవాక్యపరిపాలనాధురీణుఁడగు రాముఁడు గండ్రగొడ్డట నొక్క వ్రేటునఁ దల్లిశిరంబుఁ దెగవేసె. జనకుఁ డమితాహ్లాదంబున సుతు నక్కున గదియించి "కుమారా! నీవే నిక్కపుఁ గొమరుఁడవు. నీ యిచ్చవచ్చిన వరంబు గోరుకొమ్మిచ్చెద"ననుటయు తడవుగా రాముఁడు జనకున కెఱఁగి, "తండ్రీ! నా మాతను బునర్జీవితగను, భ్రాతల శాప విముక్తులుగను జేయుమనియు మాతృవధా సంజనిత పాతకంబు దన్నంటకుండఁ జేయుమనియుఁ గోర ముని తనయు నగ్గించి వాని ననుగ్రహించె.

ఆ కాలంబున హైహయాధీశ్వరుండగు కార్తవీర్యార్జునుండు దత్తాత్రేయు నుపాసించి వైరివిజయంబును బాహు సహస్రంబును వరంబులుగాఁ బడసి యేడుదీవుల నిరం

కుశంబుగఁ బాలింపుచు గగన విలసిత దినమణి భాతి భాసిల్లుచుండెఁ. అతఁ డొకనాఁడంగనామణులఁ గూడి రేవా నది యందు జలక్రీడ లానందంబుగఁ జేయుచుండ నా తీరవని తల కా యగాధ జలంబులఁ గాల్స్నానకుండు చెలంగి తన సహస్ర బాహువులతో నా జలంబుల నరికట్టె. అంత నా ప్రవాహం బతిరభసంబున వెనుదిరిగి సరిత్తటంబున విడిసిన లంకేశ్వరు శిబిరంబు ముంచివైచె. అంతఁ బోక శంభు పద పూజా నిరతుండగు రావణుని పూజా విధానంబున కంతరాయంబు గల్పించె. అద్దాన లోకవిద్రావణుండగు రావణుండు మండిపడి "ఇట్లొనర్చిన యద్దురాత్ము నంతకు మందిరంబున కంపకంబు వెట్టెద" నని యట్టహాసంబుతో బయలు వెడలె. హైహయుండు సపత్నీ యుతంబుగఁ దెలినీటి జల్లులాడి సంతృప్తుఁడై ధౌతవస్త్రంబులఁ దాల్చి పట్టణోన్ముఖుండయ్యె. మనుజాశనుండు వానిని మార్గంబున నిరోధింప సహస్రబాహుండు వింశతిబాహు నొక క్షుద్ర కీటకంబుగ నెంచి కరచరణంబుల బంధించి కొనితెచ్చి కారాగార నిబద్ధుఁ గావించె. కొన్నాళ్ల కా దనుజేంద్రు జనకుఁడగు పులస్త్యుం డరుదెంచి యర్జునునిచే సపర్యలనంది రావణు బంధ విముక్తుఁ గావించుకొని పోయెను.

అట్టి నిరుపమాన బాహుబల సమగ్రుఁడైన కార్తవీర్యార్జునుఁ డొకనాఁడు నిండుపేరోలగంబుండ న

నట్టుం డశనార్థియై రా నతండు గిర్యరణ్యముల విడిచివచ్చె. అట్లాతం డాహారించుతఱి నందు మిత్రావరుణ నందను నా శ్రమంబున కాశ్రయంబైన కాననంబతఁడు లేని సమయం బున సమసినఁ గనలి సత్యంబు నారసి నహస్రబా హునికడ కేగి "రాజా! మదాశ్రమ ప్రాంతారణ్యము పరిహరింపక గహన సామాన్యబుద్ధిఁ గాల్పించితివి. కావున నీ బాహువులు పరశురాముండు పడఁగూల్చుత" మని శపిం చె. అంత నతఁ డత్యంత ఖేద హృదయుఁడై ధర్మకార్యంబు లఁ జేయుచు దినంబుల గడపుచుండె. ఇదియ కారణంబుగ వాని కవినీతులైన పుత్రులనేకులు గల్గిరి. వారొక దినంబు న జమదగ్నియుఁ బరశు రాముఁడును నాశ్రమంబున లేని వేళ కానఁ జొచ్చి కామధేనువును సవత్సంబుగ బంధించి తమ గృహంబునకుఁ గొనిపోయిరి. కాని తేని కావృత్తాంత మావంతయుఁ దెలియదు. జమదగ్ని పర్ణశాలఁ బ్రవేశించి మొదవు గన్పడమి విచార నిమగ్నుఁడై పాలుపోవని మనం బున నొకచోఁ బరితపించుచుఁ గూరుచుండె. ఆ తరుణము నకే భృగురాముండు సోదరులతోఁ జనుదెంచి కన్నతండ్రి విన్నబోవుట కన్నులారఁ గాంచి జనని వలన సమాచారం బెఱింగి మహిష్మతీపురంబు సొచ్చి కార్తవీర్యార్జునునిపై గ వినెను. శాత్రవ దుర్జయుండగు నర్జునుండును బటుతర నిశిత మార్గణంబుల నా బాపనిపైఁ గురిపించిన

మ॥ ధరణీదేవుఁడు రాముఁడాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు
ష్కరచాపంబొక టెక్కు పెట్టి శరముల్ సంధించి పెల్లేసి భూ
వరు కోదండము లొక్కచూడ్కిఁ దునిమెన్ వాఁడం
[తటన్ బోకవే
తరువుల్ జువ్వకు శారధారనఱకెన్ దద్బాహుసందోహముల్

అట్లు వాని నాజి నిర్జించి కామధేనువును వత్సయుతంబుగ గొంపోయి హాయినుండె.

ఒకనాఁడు పరశురాముఁడు భ్రాతలతోఁ గూడి సమిత్కుశ పత్రపుష్ప ఫలంబులఁ గొనిరా పరిసరారణ్య భూముల కరిగె. మునిపత్ని నీరంబులఁ దెచ్చుటకై హ్రదంబున కేగె. అత్తఱి జమదగ్ని కృతస్నాతుఁడై కృష్ణాజినంబునఁ బ్రశాంతవృత్తి నిమీలిత నేత్రుండై ప్రాణమనోబుద్ధి పంచేంద్రియ వ్యాపార మరికట్టి జాగరణాది స్థానత్రయంబు దాఁటి సర్వేశ్వరు నాత్మ నిల్పి నిరుపమ నిశ్చల ధ్యాన తత్పరతనుండె. అట్టియెడ నర్జునాత్మజు లందొక్కరుఁడు బెడిదంపుటడిదంబుగొని పటిలంబుగ సదనంబుఁ జొచ్చి ముని కుత్తుక నుత్తరించి చనె. రేణుక జలఘటంబుతోఁ బర్ణశాలలో నడుగిడ నా ప్రదేశమందొక్కెడ శిరంబును వేఱొక్కెడ మొండెంబును విడబడి చిమ్మనగ్రోవిలోని వసంతమట్లు రుధిరంబీవలకు సంతత ధారగాఁ బ్రవహించుచుండె. పాప మా సాధ్వీలలామ ప్రాణేశ్వరు నాకస్మిక జలవన్మరణంబున

మిక్కుటంబగు వగలఁ బొగలుచుండె. అంతఁ గొంత తడవు
న కన్నులతో రాముఁడే తేర నా ప్రదేశ మంతయు నార్త
నాదముతో మారు మ్రోయుచుండె. భృగుపత్ని "రామా!
భార్గవరామా! ఎవ్వరింట లేకుంటచూచి రాజులు తపస్స
మాధియందున్న నీ జనకుఁ బొదివిచంపి"రని ముయ్యేడుమా
రులు గుండెలు మోదుకొంచు విలపించె. అంత పరశురా
ముఁడు "అగ్రజులారా! మీరు విచారంబుడిగి పితరుని కళే
బరంబు నొక్కెడ భద్రంబుగఁ గాపాడుఁడు. నిరపరాధు,
నిశ్చల సమాధి నిర్మగ్న మజ్జనకుఁ బిలుకుమార్చిన యా
తులువల నా కుఠారధార కెర జేసి వెండియు బహు భోగ
పరాయణులును, సాధుసజ్జన హింసకులును నగు బాహుజు
లనెల్లరఁ బరిమార్చి వారిరక్తంబులచేఁ బైతృకతర్పణంబు గా
వింతు"నని శపథంబుఁ జేసె. అఖండ తపస్సముపార్జితంబైన
పరశువు భుజంబున ధరించి సాక్షాచ్ఛివునివలె మహిష్మతీ
పురంబు సొచ్చి పురద్వారంబున నిల్చె. అట్లు నిల్చిన పరా
క్రమ విక్రముండగు రామునిఁ గని సైన్యాధిపతులు పదియే
డ క్షౌహిణులతో నెదురువచ్చి నేల వడంకునటుల నట్టహా
సంబుగ నార్చుచుఁ, గర్ణ కఠోరంబుగ ధనుష్టంకారంబులఁ
జేయుచుఁ బ్రాసపట్టిసతోమర భిండి వాలంబులచే నవ్విప్రు
నొప్పించిన నా యవని సురుఁడు ప్రళయ సమయ సమవర్తి
భంగిఁ గ్రోధా రుణ నేత్రుఁడై శత్రుకంఠవిలుంఠన సమర్థం

బగు కుఠారంబు సారించి తొల్కరిపట్టునఁ బచ్చిక పట్టుల వృద్ధిజేయఁ దుప్పలం గొట్టు సేద్యగాని కైవడినెల్ల యెడలఁ ధ్యానమై భట సందోహంబులఁ జించి చెండాడె. అయ్యెడ రథంబులు శిథిలంబు లయ్యె. తురంగంబులు నిరంగంబు లయ్యె. అర్జునుఁడు సైన్యవినాశనమున విచారంబును, బాప ని యకుంఠిత దోర్బలంబున కచ్చెరువును దోప జయరేఖా ధాముండగు రాము నొక్కవడిఁ దాఁకె. పరశురాముఁడొక తృటిలోఁ గార్తవీర్యునిర్వీర్యుఁ గావించి యరదంబుపై కురికి వాని శిరంబుఁ బరశుధారాహతినిలఁ ద్రెళ్లనేసె అతనిపుత్రు లొక్కుమ్మడి నతిరభసంబునఁ జుట్టుముట్ట వారల నేలఁబెట్టి కాల మట్టి గిట్టఁజేసె. అతని సతులు స్త్రీవధ యేడజేయునో యని యాక్రందనంబులఁ గూడఁ గట్టిపెట్టిరి. పౌరు లా రౌద్రిమూర్తిఁ జూడజాలక పంచల నొదిగియుండిరి. జామదగ్ని నిర్మానుష్యంబైన యా పట్టణ రాజవీధుల నపర రుద్రుఁడో యన నేగుచుండ నొక్కరుంగూడ నతని మొగంబును దేరిజూడ నోడిరి.

తదనంతర మా రాముఁ డుత్తరదిశ కేగి పుళింద ప్రాగ్జ్యోతిష శబర తురుష్క మాళవాది భూపతుల వంశంబుల నిర్వంశంబులఁ జేసె. ప్రాగ్దిశ నంగ, వంగ, కళింగ కాశ్మీరాది నృపాలురఁ గూకటి వ్రేళ్లతోఁ గూల్చి వైచె. దక్షిణదిశకుఁ బోయి యవంతి, సౌరాష్ట్రాది నేలదొరల

నేల బారలుఁజేసె. పశ్చిమదిశ కరిగి మరుదేశ, బర్బర శైరీషకావనీనాథుల సతుల ననాథలఁగావించె. అంతఁ బోక క్షత్రియు లెవ్వరైన సజీవులయి దాగియుండిరేమో యని యెల్లెడల వెదకి వెదకి యిర్వదియొక్కమారు ప్రపంచమంతయు గాలించి క్షత్రియకులంబు నిక్షతంబుఁ జేసె. అంత నా రాముండు శమంత పంచకంబున రాజరక్తంబుతో నైదు మడుగులు కావించి జనకు శిరంబుఁ దెప్పించి మొండెంబుతోఁ గూర్చి సర్వదేవమయుండగు దేవుండు తాను కావునఁ దన్నుద్దేశించి యశ్వమేధయాగ మొనర్చి తా గడించిన ధరణి నంతయుఁ గశ్యపునకు దక్షిణగా నొసంగె. అతఁడీ ధారుణినెల్ల భూసురులకిచ్చి తపోవనంబుల కేగె. ఆ కారణంబున నీ భూమి యాతని పేరఁ గాశ్యపి యని పఱగుచున్నది.

సంపూర్ణము